# ప్రహసనములు



వీరేశలింగంగారు

★

"ప్రహసనములను నేను కేవలం వినోదము కొరకు మాత్రమేగాక అతిబాల్యవివాహము, వృద్ధ వివాహము, కన్యాశుల్కము మొదలైనదురాచారములవలన అనర్థములనుజూపి జనులను వానినుండి విముఖులనుజేయు తలంపుతో కూడ వ్రాసితిని.

"పుండు పుట్టినప్పుడు దానినికోసి చికిత్సచేసి మాన్పించక పుండేలేనట్లు నటించుటలో లోపల కుళ్లుచుండగా పైపై నిరామయస్థితిలో నున్నట్లు పొగడుచుండుటవలన లాభమెప్పుడునుగలుగనేరదని నాయభిప్రాయము." [స్వీయచరిత్రనుండి]

ఆంధ్ర
అభ్యుదయరచయితలసంఘం

# వీరేశలింగం
# ప్రహసనాలు

[ కందుకూరి వీరేశలింగం పంతులుగారి 25 వ వర్ధంతి సందర్భంలో ప్రదర్శనయోగ్యంగా సవరించబడి, హితకారిణీ సమాజ ధర్మకర్తల అనుమతితో ముద్రించబడ్డాయి.]

ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం
గవర్నరుపేట : : బెజవాడ

మే, 1944

ఆరణాలు

# విషయసూచిక




ప్రజాశక్తి ప్రెస్

బెజవాడ

I

# మనవి

వీరేశలింగం పంతులుగారు 1919 మే 27 వ తేదీన పరమపదించారు. అప్పుడే ఆయన పరమపదించి 25 ఏండ్లయింది.

వీరేశలింగంగారు యుగపురుషులు. ఆంధ్రసమాజానికీ, సాహిత్యానికీ ఆయన చేసిన సేవ మరచిపో వీలులేనిది.

ఆంధ్రసాహిత్య చరిత్రలో నూతనశకాన్ని ప్రారంభించారు వీరేశలింగంగారు. అంతకుముందు లేని రూపాలెన్నిటినో తెలుగుసాహిత్యంలో జొప్పించారు. ఎలిమెంటరీ స్కూళ్ళకు పనికివచ్చే వాచకాలు మొదలుకొని, స్వీయచరిత్ర వరకు ఆయన సాహిత్య సృష్టిలోకి రాని రూపమేలేదు. పండితులకే గాని సామాన్యజనుల కందుబాటులో లేని సాహిత్యాన్ని ఆకాశవీధినుండి క్రిందికి దింపిన మహనీయుడతడు. నాటకాలు, నవలలు, ప్రహసనాలు, చరిత్రలద్వారా తెలుగు వచనవాఙ్మయాన్ని మహోన్నతదశకు తీసుకు వచ్చిన ప్రముఖుడతడు. సాహితీప్రపంచంలో అతడు చేసిన కృషిని, అతడు చూపిన పురోగామిపంథాను, తెలియజేయాలంటే చాలా అవుతుంది. కాని ఒక్కవిషయం గమనించాలి.

సాహిత్యానికి ఒక ప్రయోజనం ఉంటుంది. ఆ ప్రయోజనసిద్ధికై పాటుబడటం, ప్రచారం చేయడం అందరికర్తవ్యం. వీరేశలింగంగారు ప్రచారంకోసమే—తన ఆశయాలైన వితంతువివాహ, బాల్యవివాహ, కన్యాశుల్క ఖండనం కోసమే — సాహిత్యకృషి చేసినా, కళ క్షీణించలేదు. పైగా ఆంధ్రులిదివరలో కలలోనైనా తలవనిరీతిగా బహుముఖాలుగా సాహిత్యం వికసించింది. "కళ, కళకోసం, ప్రచారంవల్ల సాహిత్యం అడుగంటింది." అని అనే వారంతా వీరేశలింగంగారిని జ్ఞప్తికి దెచ్చుకొంటారని మనవి. ముఖ్యంగా ఇపుడు వీరేశలింగ వర్ధంతిసమయాన ప్రచురించుచున్న యీ ప్రహసనాలు, కళ ఆయుధంలా ఎలా ఉపయోగింపబడుతుందో తెలియజేస్తున్నాయి.

ఆయన చూపిన అభ్యుదయ పంథాను నడిచి, ఆయన ఆశయాలను ప్రజలకు మరింత సన్నిహితంగా తీసుకువెళ్ళడానికే వీరేశలింగవర్ధంతి జరపబూనుకొన్నాం. ఇందుకు నవ్యసాహిత్య పరిషత్తువారూ, హితకారిణీ సమాజంవారూ, వివిధ యువజన, విద్యార్థి, మహిళాసంఘాలవారూ మాకు తోడుగా నిలిచినందులకు కృతజ్ఞులం.

ఈ సందర్భంలో వీరేశలింగంగారి ప్రహసనాలను, వర్ధంతిరోజున ప్రదర్శించ నిశ్చయించాం. అందుకుగాను, గ్రంథకర్తగారి ఆశయాలకు ఎట్టినష్టం రాకుండా, ప్రదర్శనానికి అనుగుణ్యంగా ఈ ప్రహసనాలను సవరించాం. భాషను వ్యావహారికంగా మార్చాం.

పొడువాటి ఉపన్యాసాలను రచయిత భావాలు పోకుండా క్లుప్తీకరించాం. ఇందుకు సమ్మతించిన హితకారిణీ సమాజకార్యదర్శి పెద్దాడ సుందరశివగారికి మా ప్రత్యేక అభివందనాలు తెలియజేస్తున్నాం.

ఇందులో 6 ప్రహసనాలు ముద్రించబడినాయి. ఒక్కొకదానిలో ఆనాడు ప్రభుత్వోద్యోగులలోవున్న చెడుఅలవాట్లను, సమాజంలోవున్న మూఢవిశ్వాసాలను వీరేశలింగం పంతులుగారు ఎత్తిచూపారు. ఆ దురాచారాలను వదలితేగాని సంఘం బాగుపడదని సూచించారు. ఇంతకాలమైన తరువాతకూడ వానిలో చూపబడిన దురలవాట్లు యింకా మన సమాజంలో వున్నాయనీ వాటిని పూర్తిగా తొలగించితేగాని సమాజం అభివృద్ధిచెందదనీ వీటిని చదివితే మనకు బోధపడుతుంది.

(1) మునిసిపల్ నాటకంలో ఆరోజులలో నామినేటెడు సభ్యులు ఎలా ప్రజలను పీడించేవారో, ఉద్యోగులు లంచాలు పుచ్చుకొని, పౌరుల సౌకర్యాలను ఎలా నిర్లక్ష్యం చేసేవారో పంతులుగారు చిత్రించారు. (2) వినోద తరంగిణిలో ఒకవైపున ముసలివాడు బాలికను పెండ్లాడి పడే అవస్థలను చిత్రించారు. రెండోవైపున బాలవితంతువులకు పునర్వివాహాలుచేస్తే కుటుంబ ప్రతిష్ఠ పోతుందని, వారు యౌవనోద్రేకానికి లొంగి ఏ దుర్మార్గుని చేతనో మోసపోయి గర్భం తెచ్చుకొన్నప్పుడు పడేపాటులను చక్కగా కండ్లకు కట్టినట్లు చూపించారు. (3) 'జమాబంది' ప్రహసనంలో కరణాలు మొదలుకొని పై ఉద్యోగుల వరకు, కాలవగుమాస్తా, మైలుజవాను మొదలు ఓవర్‌సీర్లవరకు రైతులనుంచి గుంజే మామూళ్ళు, వాటివలన ప్రజల బాధలు వర్ణించారు. ఈ అన్యాయాలనుండి తప్పించుకోడానికి ప్రజలు ఆందోళన చేయాలనీ, పిటీషన్లు వగైరా ప్రజాసమీకరణద్వారా పై అధికారులపై ఒత్తిడితెచ్చి వీటిని తొలగించుకోవాలనీ, ప్రజాసేవకుల కర్తవ్యం యిదేననీ పంతులుగారు నిరూపించారు.

(4) గొట్టాలమ్మ. (5) శకునాలు, అను ప్రహసనాలలో పంతులుగారు మూఢవిశ్వాసాలవల్ల కలుగుతున్న అరిష్టాలను వర్ణించారు. వీటిచాటున మోసగాండ్రు ప్రజలను ఎలాదగాచేసి తాము లాభంపొందుతున్నారో చూపారు. (6) శిశుపోషణలో తల్లి మూఢనమ్మికవల్ల పిల్లల ఆరోగ్యానికి చేటుగల్గుతుందనీ, ఆరోగ్యసూత్రాల ననుసరించుటవల్ల పిల్లలు పుష్టిగా వుంటారుగాని మూఢాచారాలవల్లగాదనీ. రుజువుచేశారు.

మే 27 వ తేదీన వీరేశలింగ వర్ధంతిని విజయవంతంగా చేయాలని ఆంధ్రులందరినీ ప్రార్థించుతున్నాం. ఆ వుత్సవాలలో ఈ ప్రహసనాలను వినియోగించుతారని ఆశించుతాం.

చదలవాడ పిచ్చయ్య,
కార్యదర్శి, ఆంధ్రరాష్ట్ర అభ్యుదయ రచయితలసంఘం.

# మునిసిపల్ నాటకం

## ప్రథమాంకం

### ప్రథమ రంగం

( బుచ్చయ్యపంతులుగారి చావడి )

[ కమిషనర్లు బుచ్చయ్యపంతులుగారును, గున్నయ్యనాయుడుగారును, సోమిశెట్టి గారును, ఖాదర్‌సాహెబ్‌గారును ప్రవేశిస్తున్నారు ]

బుచ్చ :—నాయుడుగారూ ! ఇప్పుడు మన మునిసిపాలిటీస్థితి ఏమీ బాగుండలేదు. అంతా కొత్త కొత్తవాళ్ళు. అప్రయోజకులు కమిషనర్‌హోదాకు వచ్చారు. వాళ్ళకు నాలుగు డబ్బులు ఏరుకోవడమూ చేతగాదు. ఏరుకునేవాళ్ళనుచూస్తే ఓర్వనూలేరు !

గున్న :—ఔనయ్యా. వీళ్లమూలంగా మనవంటి వాళ్ళం నెలకు నాల్గురాళ్ళు తంటాలు పడుతూ ఉన్నాముకాని పెద్దమనుష్యులుగా ఉండేవాళ్ళకి చిల్లిగవ్వ దొరకడంలేదు.

సోమి :—ఇది మహాఅన్యాయంగా ఉంది ! మనమందరంచేరి ఏదోరకంగా యీ కొత్త వాళ్ళను వదుల్చుకుంటేనేగాని మన మర్యాద దక్కదు. పూర్వం కొద్దిగానో గొప్పగానో లాభం పొందని కమిషనర్లు ఒకరూలేరు. నామట్టుకు నాకు యావరేజిమీద నెలకు ముప్పైరూపాయలు కళ్ళబడేవి.

ఖాద :—మీకి ఏమిదొరికేదోకాని మాకి పావలా బేడాకంటే యెప్పుడూ ఎక్కువ చేతులో పడాలేద్. అప్పుడూ మీరే అంతా దోచుకునేవోళ్ళు!

బుచ్చ :—సాహెబుగారూ ! మనలోమనం దొమ్ములాడడం మంచిదికాదు. మనం యెంత తిన్నా తిన్నవాళ్ళమే ! మనమందరం ఏకంగావుంటే ఇదివరకు విస్తారం దొరక్కపోయినా యిక దొరుకుతుంది.

ఖాద :—అరే ! నేను ఏమీ అన్నానయ్యా ! నాకి నెలకి పదిరూపాయలిస్తానని దస్తావేజు రాసీఇయ్యి. నేను ఎందులో దస్కత్‌చెయ్యమంటే అందులో దస్కత్‌చేస్తాన్.

బుచ్చ :—సరి, సరి! ఇందులో దస్తావేజులూ, దస్కత్ చేయడమూకూడానా! కాస్త కాగితంముక్క మన విరోధుల చేతుల్లోపడితే వాళ్ళు మనకొంప తీసేస్తారు.

గున్న :—ఔనౌను! అన్నతర్వాత లేదనవచ్చును గనుక మనం వేయిమాటలు చెప్ప వచ్చునుగాని, కాగితంమీద ఒక్కఅక్షరం యెక్కించరాదు. అది వాళ్ళచేతుల్లో చిక్కిందంటే గొంతు పట్టుకుంటుంది!

ఖాద :—సరి, సరి, లేవయ్యా! మీరంతాయేకమై డబ్బుదొబ్బడం మొదలుపెట్టి మానెత్తికి పేడరాయడానికి ఏషాలేస్తూ ఉండార్. దస్తావేజు లేకపోతే ఎట్లా నమ్మకం కుదురు తుంది? కావలిస్తే దస్తూరీమాత్రం లేదన్రాదూ? మీ దస్తూరీని నాకు దస్తావేజు రాసివ్వండి. మీకంతగా మాటవచ్చేమాటుంటే యీ దస్తూరీ మీదీకాదని ప్రమాణం చేసి, వాజ్మాలమ్ యిస్తానోలేదో చూద్దురుగాని! ఎందుకయ్యా నీకీభయమ్? మొన్న హెడ్‌గుమాస్తాగారిక్కి మాట వస్తుందంటే మనమందరం ప్రత్యక్షంగా ఎరిగిం దానిలో దస్తూరీ అతనిదికాదని వొక్కటాకీని పలకలేదూ! అప్పుడు, నిజం చెప్పినవాళ్ళమాటే అబద్ధం అయిందాలేదా? ఇందులోనూ అంతే అవుతుంది. రాసీ యియ్యండి.

బుచ్చ :—మీకు వేయి సలాంలు. మీరు కలిసివచ్చినా రాకపోయినా కాగితం ముక్క మీద ఒక్క అక్షరం రాయను.

ఖాద :—మీకీ డబ్బూ ఇప్పిస్తామని యింతగా చెప్తూవుండార్ గనక మీతో చేరుతూవుండా. ఈ అరుగుల్ తగాదాలో నాకీ ఏమీ యిస్తార్?

గున్న :—ఈ కొత్తవాళ్లు అడ్డంరాకపోతే మనకు పాతికరూపాయిలు తక్కువగాకుండా వస్తవి. ఇందులో మన శక్తి చూపించాలి.

ఖాద :—ఒక్క దెబ్బని నెగ్గుతాం! అరే, సర్కార్ స్తలం కలుపుకున్నారన్నా, పది గజాల్‌వీధి ఉండప్పుడు అందులో నాల్గుగజాల్‌పోతే ఎవరికీ యిబ్బందిలేదని వాదిద్దాం. ఎందుకయ్యా అంత వెడల్పువీధీ? హక్కడికీ బీధీ హారుగజాల్ వెడ ల్పుంటుందిగా! ఏదీ మనపూళ్ళో నాల్గుగజాల్ వెడల్పుబండి వక్కటి చూపించు,

బుచ్చ :—సాహెబ్‌గారూ! ఇందులో మనమంతా ఒక్కటాకీని పలకాలిసుమండీ! ఏమయ్యా మనవాళ్ళు ఏడుగురువుండగా మనం నలుగురం మాత్రమే కనబడుతున్నాం. వాళ్ళు రాలేదేం?

సోమి :—వాళ్ళ పూచీ నాది. ఎట్లా పలికించమంటే అట్లా పలికిస్తాను. వాళ్ళతో ఏమి చెప్పమన్నారో చెప్పండి. మన విరోధులెప్పుడూ మీటింగుకురారు. మన మందరం మీటింగుకు వెళ్లితే రేపు మెజారిటీ మనదే అవుతుంది.

గున్న :—భేష్! పంతులుగారూ, వీధి అరుగులవిషయమై యాభై రూపాయలకు తక్కువైతే వీల్లేదని ఖచ్చితంగా యీ రాత్రే బేరమాడి సొమ్ము చేతుల్లో వేయించుకోండి. రేపు మీటింగునుంచి వచ్చేటప్పుడు యీ దారినే వచ్చి సొమ్ము పంచుకుందాం.

సోమి :—అప్పుడే తొందరపడకండి. మునుపటికాలంలో మేము ఎందరికో వుపకారం చేసి, వాళ్ళను బాగుచేశాం; మేమూ బాగుపడ్డాం. వెనక మా యిల్లు కట్టించుకున్నప్పుడు చేతిది దమ్మిడీ ఖర్చయిందటండీ మునిసిపల్ సొమ్ములోనుంచి పదిరూపాయలు ఖర్చుపెడితే యిందులో యెవడి తాతసొమ్ము పడిపోయింది? ఒక్కవీధిని తూము కట్టించవలసివస్తే, కావలసిన దానికి నాలుగురెట్లు యెక్కువవేసి, బజారు ధరకంటే రెండింతలు ఖరీదు ఎక్కువ పుచ్చుకొని తెల్లవారేవరకు ఒక్కొక్కయింటిగోడలు లేవదీయించేవాణ్ని. దొరలు ధర్మాత్ములు గనక, వాళ్ళకు యీ మాయలూ, మర్మాలూ తెలిసేవికావు!

బుచ్చ :—మీరు, వెనుక దీపాలు పెట్టించేవారుకదా! అందులో ఏమాత్రం మిగిలేదండీ?

సోమి :—అందులో దీపం వక్కంటికి కనీసం రూపాయిపైగా మిగిలేది. ఇదిగాక యెనమండుగురు నౌఖర్లు ఎప్పుడూ మనయింట్లో పనిచేస్తుండేవారు. కమిషనర్లందరికీ యింటి దీపాల్లోకి చమురు యిందులోనుంచే సప్లయిచేసేవాళ్లం.

గున్న :—సరే, వెనకటి మాటలెందుకుగాని, మొన్న వారి స్థలానికి ఆవరణపు గోడ సంగతి ఏమైంది? అందులో మనకు యేభై రూపాయలన్నా దొరుకుతాయా?

సోమి :—అంతమట్టుకు దొరకొచ్చు. మనవూళ్లో ఖాళీస్థలాలు చాలా ఉన్నాయి. ఏమైనా పెద్దమొత్తాలు దొరికితే యిటువంటివాటిల్లోనే.

గున్న :—మీ రోడ్డు కంట్రాక్టులో ఏమి దొరుకుతూఉన్నదండి?

బుచ్చ :—ఇప్పుడు రేట్లు తక్కువైనాయి గనక కంట్రాక్టుదార్లు నూటికి పదిరూపాయిలకంటే ఎక్కువ యివ్వడంలేదు. అవికూడా దొరక్కుండా యీ కొత్త కమిషనర్లు పనులన్నీ తమలో వారిచేతనే చేయించడానికి రిజల్యూషన్లు చేయిస్తూ ఉన్నారు. అక్కడికి మేనేజరు మనవాడు గనక, వాళ్ళ మీటింగుకు రానప్పుడు ఒకటీ, అరా రోడ్ల రిపేరు ముక్కలు మనమీద పెడుతుంటాడు. అదుగో! వెంకట్రావు వస్తున్నాడు. ఇప్పుడు మాట్లాడుకోకూడదు. రేపు మళ్ళీ యిక్కడే మీటౌదాం. (అని వెళ్ళుతున్నారు.)

# ద్వితీయ రంగం

## మునిసిపల్ సభ

[ వైసు ప్రెసిడెంటుగారూ, మదనయ్యగారూ, నాగభూషణరావుగారు, బుచ్చయ్య పంతులుగారు, గున్నయ్యనాయుడుగారు, సోమిశెట్టిగారు, ఖాదర్‌షాహెబ్‌గారు మొదలైన కమీషనర్లు ప్రవేశిస్తున్నారు. ]

బుచ్చ :—మేనేజరుగారూ ! కామిశెట్టివీధి అరుగుల అర్జీ ముందుగా తీయండి.

మేనే :—అదే పైనవున్నదిగాని దానిలో యింకా కొంచెం తగాదాఉన్నది. పై మీటింగుకి నిలుపుచెయ్యాలి.

మద :—ఈ మీటింగులోనే పరిష్కారం కానియ్యండి. ఆ యింట్లో నేను వెనుక కాపుర ముండేవాణ్ని. ఆ సంగతి నాకు బాగా తెలుసు.

గున్న :—అలాగైతే తియ్యండి ! మేమందరంకూడా ఎరుగుదుము. అందరూ ఎరిగిన వారున్నప్పుడే యిదిపరిష్కారం కావాలి.

మేనే :—ఇందులో దస్తావేజులూ అవీచూడాలి. తొందరపడతారేం ?

బుచ్చ :—(సోమిశెట్టిగారితో రహస్యంగా) ఇందులో మేనేజరుగారి చేతులోపడేది యింకా పళ్ళేదు. అందుకే యీ అభ్యంతరం. అముందాకొడుకు యిచ్చేదంతా విన్నానే ఎందుకిచ్చాకుకాదు ?

సోమి :—(రహస్యంగా) విన్ననే యిస్తానని సొమ్ము తీసుకు వెళ్ళాడు. కాని బేరం సొసాయించిందికాదు, పదిరూపాయలకు ఒప్పుకోలేదాయన.

మద :—దస్తావేజుల సంగతి నాకుతెలుసు, తియ్యండి.

సోమి :—నాకూ తెలుసుగా తియ్యండి.

మేనే :— చిత్తం ! మనకందరికీ అభ్యంతరంలేకపోతే తీస్తాను. అవునోయి నీ స్థలం వెడల్పెంత ?

కామి :—పదిగజాలండి !

బుచ్చ : —నీకంతా బాగుగా జ్ఞాపకమున్నదో లేదో ; జ్ఞాపకం లేదని చెప్పు !

సోమి :—దస్తావేజుచూచి మనవి చెయ్యాలనిచెప్పు. ఊరుకుంటావేం ?

మద :—నేనెరుగుదును. వెడల్పు పదిగజాలే. అతడు కమీషనర్ల శలవుపొందకుం డానే నాలుగు గజాలవరకు అక్రమించుకొని అరుగులు పెట్టినాడు. అవి తీసే యించాలి.

కామి :—అయ్యా! నేను డివిజన్ కమీషనర్ల శెలవు ప్రకారమే అరుగులు వేసుకొన్నాను. వారు స్థలం హద్దుచూపించి ఎండార్స్‌మెంటు వెనకనుంచి పంపిస్తాం వేసుకోవచ్చునని సెలవిచ్చారు.

బుచ్చ :—అవును. మేము ఎరుగుదుము గనక. నేనూ గున్నయ్యనాయుడుగారూ వెళ్ళి కర్రలుపాతించి హద్దు చూపించాము. ఇతడు అరుగులు హద్దులోనే వేసుకున్నాడు గాని ఒక్క యించియైనా అవతలికి రానియ్యలేదు.

ఖాద :—ఔనయ్యా! అది మేమెరుగుదుం. అతడేమీ సర్కార్‌స్థలమ్ ఆక్రమించుకో లేదు. రాజాగారివీధి మేమెరుగమటయ్యా?

మదా :—అది రాజాగారి వీధి కాదంటోయ్. నవాబుగార్రి వీధి! మీరు ఏదో మరోయింటి మాట అనుకుంటున్నారు.

ఖాద :—ఎవీధైతేనేమి? నవాబ్‌గారివీధి ఎరుగుదుం; అన్నివీథుల్ ఎరుగుదుమ్.

సోమి :—ఏవీధైనా అతను స్థలమాక్రమించుకోలేదు.

గున్న :—నేను స్వయంగావెళ్ళి చూచి పరిష్కరించి వచ్చినవాణ్ణి.

మద :—అయింట్లో కాపురమున్నవాణ్ణి నాకంటె మీకందరికీ మహాయెక్కువ తెలుసునా యేమిటి? అసలాస్థలం మొట్టమొదట బచ్చువారికి అమ్మిందెవరు? మేముకాదూ! ఆ బచ్చువారి దగ్గరనుంచే యితడుకొన్నాడు. రిజస్టరీ దస్తావేజు తెప్పించి చూచి, ఏదీ యిప్పుడు వెడల్పు కొల్పించండి. నాలుగజాలు వెడల్పువున్నదో లేదో కన బడుతుందీ!

బుచ్చ :—అప్పటి గజాలు బహుపెద్దవీ! ఆ పదిగజాలూ యీ పద్నాలుగుగజాలూ వకటే నండి. ఏమోయ్! కామిశెట్టీ కాదుటోయ్!

మద :—ఏదీ, పెద్దమనిషి కామిశెట్టి కన్యకామ్మవారి మొగంచూచి ఆమాట అనమనండి.

బుచ్చ :—అల్లాగైతే ఆ కొలతలో వీధి అరుగులు పడలేదు. ఆ నాలుగుగజాలూ వీధి అరుగులకొలత.

మద :—ఏమిటయ్యా! మునుపు ఆపక్కన అరుగులుండేవిటయ్యా. అక్కడ గుమ్మమే లేదు.

సోమి :—అరుగులు ఉండేవికాని, యీమధ్య రోడ్డుయెత్తు ఎక్కువ కావడంచేత పూడి పోయినాయి. మదనయ్యగారూ! మీరెవరూ పుట్టకమునుపటినుంచీ నేనా స్థలా న్నెరుగుదును: అక్కడ అరుగులు పూర్వం వుండేవి.

బుచ్చ :—(మదనయ్యతో రహస్యంగా) వాడు సర్కారువీధి అక్రమించుకున్నాడుగాని ఎవరిస్థలమూ అక్రమంగా అక్రమించుకోలేదుగా ! ఇందులో మీకు ఏం నష్టం ఉంది ? బీదవాడు పెట్టుకొన్న గోడ అరుగులు తీసివెయ్యకుండా అనుగ్రహించి కాస్త పుణ్యం కట్టుకొందురూ !

ఖాద :—ఇందులో సర్కారుస్థలం కాస్త కలుపుకుంటేమాత్రం హెవరికి యిబ్బందీ ఉందయ్యా ? వీధి కావాల్సినంత వెడల్పు ఉండాది. అరుగుల్ వేసుకో అని అర్డర్ వేసీ యివ్వండి.

వైస్ :—(ఇంగ్లీషులో) - వాటార్ ది కమీషనర్స్ సేయింగ్.

నాగ :—(ఇంగ్లీషులో) - ఇటీజ్ క్లియర్ సర్, దట్ హీ హ్యాస్ అక్యుపైడ్ దిప్లేస్. యూ మే అర్డర్ టు రిమూవ్ దోస్ పయాల్స్.

మేనే :—అరుగులు వారం రోజులలోగా తీసివేయవలసిందనీ, తీసివేయకపోతే ప్రాసిక్యూషన్ చేస్తామనీ దొరవారు అర్డరు వేశారు.

ఖాద :—ఇది కేవలం అన్యాయం ! వాడీనోట్లో మన్ను వేస్తే మీకి హేంటీ వస్తుందయ్యా ?

బుచ్చ :—కామిశెట్టీ ! మేము యేం చెప్పినా లాభంలేకపోయింది. నాలుగునెల్లు వూరుకొని యీ సంగతి ఉదహరించకుండా మళ్ళీ పిటీషన్ యిచ్చుకో ! ఈ కమీషనర్లు రాని సమయం చూచి మేము మీ పక్షంగా ఉత్తర్వుచేస్తాం. ఇంతమాత్రంచేత నీవు అరుగులు తవ్వివేయనక్కర్లేదులే !

మద :—అలా వల్లకాదు !

గున్న :—వల్లకాకపోవడానికి గవర్నమెంటువారు యేర్పరచిన కమీషనర్లము మేము అక్రమం చేసేవాళ్ళమా యేమిటి ? ఇందులో మామాట సాగకపోతే మాకు అవమానంగా వుంటుంది.

ఖాద :—ఔను, బాగా పోట్లాడవయ్యా ! బాగా పోట్లాడవయ్యా !

బుచ్చ : —ఇందులో మనం వదిలిపెట్టి వూరుకోకూడదు. బాగా పోట్లాడవయ్యా !

సోమి :—పోట్లాడ్డం ఎందుకూ ? మెజారిటీ మనమేఉన్నాం. ఓట్లు పుచ్చుకుంటే తెలుస్తుంది. ఇందులో తప్పకుండా డివిజన్ కమీషనర్ల యిష్టప్రకారం జరగాలి.

మద : —మీరు ఎంతమందివున్నా యిందులో న్యాయం చూడాలిగాని, సంఖ్యచూడకూడదు !

గున్న :— మీరు మహాన్యాయం చూస్తున్నారు! మహా మహా కోర్టుల్లో లంచాలు పుచ్చుకొని ఉపకారం చేస్తారు. అంతా మహా ముడిగట్టుకొని కూర్చున్నారా ఏమిటి?

ఖాద :— హెవళ్లకైనా హేమైనా దొర్కిపోతుందని ఓర్వలేని ముండాకొడుకుల్ అన్నింటికీ అడ్డం వస్తార్!

మద :— మాటలు తిన్నగారానీ! నీలాగు గడ్డితినే గాడిదలుంటే—

ఖాద :— అద్గో! అద్గో! మిగల్ మాటల్ రానిస్తూ ఉండావ్! ధొరగారు వింటూ ఉండార్! నేను మేజస్ట్రీటులో ఫిర్యాద్ చేస్తాన్. మీకి అంతా సాక్షులయ్యా.

బుచ్చ :— చెయ్యండి. ఇలాంటి వాళ్లకు వక్కమాటు శిక్షైతే యిక ఎప్పుడూ మనకు అడ్డంరారు.

వైస్ :— ఎబ్సర్డ్! నాన్‌సెన్స్! ది కమిషనర్స్ ఆర్ క్వారలింగ్. ఐ యాం గోయింగ్!

(అని కోపంతో వెళ్ళుతున్నాడు.)

# ద్వితీయాంకం

## ప్రథమ రంగం

[ ధర్మచావడి ]

(పోలిశెట్టి, రామిశెట్టి, గురయ్యనాయుడు, భీమలింగం, కూర్చుండియుండగా వంకాయల చంద్రమ్మ ప్రవేశించింది.)

పోలి :— రామిశెట్టిగారూ! మీరు నాలుగురోజులనుంచీ దుకాణం వదిలిపెట్టి తెగతిరుగుతున్నారు. మీ వ్యవహారం పరిష్కారమైందా?

రామి :— తడిమన్నంతా పొడిమన్ను అయ్యేటట్టుగా యీ నాలుగురోజుల్నించీ మేనేజరుగారింటి చుట్టూ తిరగ్గా తిరగ్గా ఒక్క శతమానంతో యివ్వాళ పరిష్కారమయింది. మా పేర్లు లిస్టులోనుంచి తీసివేశాడు.

పోలి :—ఈ మునిసిపాలిటీ మహా అక్రమంగావుంది. అన్యాయంగా ప్రజలసొమ్ము చాలా దోచుకుంటున్నారు. ముందటియేడు మేనేజరు బోరెకు సొమ్ముతిని, ఆసంవత్సరం కాస్త పన్ను తగ్గించినట్టే తగ్గించి, నిరుడు మళ్ళీ హెచ్చుచేసి జాబితాలో రాసి నోటీసు పంపించాడు. అందుమీద మదనయ్యగారితో మొత్తుకుంటే నీవు వక్క దమ్మిడీ ఎవరికీ యివ్వవద్దు. అప్పీలు చేసుకోమని సెలవిచ్చారు. అప్పీలు చేసు కుంటే నా అదృష్టంచేత నలుగురూ మంచి కమిషనర్లు రావడంచేత, హెచ్చుచేసిన సొమ్ము కొట్టివేసి ఎప్పటిపన్నే ఖాయంచేశారు. ఇలా ప్రయివేటుగా వాళ్ళకూ వీళ్ళకూ దర్శించుకోవడంకంటే పబ్లికుగా అప్పీలుచేసుకుంటే పన్ను తగ్గుతుంది. మేనేజరూ ఇద్దరు కమీషనర్లూచేరి యీ జాబితాలు ఊరికే తయారీచేసి పదిమంది వర్తకుల్ని పిలిపించి, మేతవేసిన వాళ్ళపేర్లు తొలగించి వెయ్యనివాళ్ళపేర్లు మీటిం గులో పెడతారు।

రామి :—ఔనౌను। ఆ మాట నిజమే। కాని అంత ధైర్యం యెవరికుంటుంది? వంకాయల పాపిశెట్టివద్ద పాతికో, పరకో లంచంపుచ్చుకొని పన్నెంతో తక్కువగా కట్టారు. ఈ ఉద్యోగుల్తో కక్షకట్టడంకంటే, వాళ్ళచేతులో ఏదో తృణమో పణమో పెడితే ఎందెందుకైనా మంచిది. వాళ్ళు తలచుకుంటే ఎప్పుడైనా కాస్త ఉపకారం చేస్తారు. మొన్న మాబావమరిది మామూలు యిచ్చాడుకాదని యింటిముందు పెంట వేశాడనీ, పిచ్చతవ్వతో కొల్చాడనీ, కేసుపెట్టి అరవైరూపాయలు వదిలించాడు. మొదటే ఆకాస్తా వాడిమొహాన కొడితే।

పోలి :—మనం తిన్నగాఉంటే ఎవరికీ ఝడియనక్కర్లేదు. మనదగ్గర పిచ్చతవ్వలు ఎందుకు ఉంచుకోవాలి? తర్వాత కచ్చేరీలచుట్టూ యెందుకు తిరగాలి? మనం న్యాయంగావుండి పన్ను ఎక్కువ కట్టినప్పుడు అప్పీలు చేసికొని మన లెఖ్ఖలు దాఖలుచేస్తే పన్ను ముదరాయివ్వక ఏంచేస్తారు।

రామి :—న్యాయంగా ప్రవర్తిస్తే వర్తకమే సాగదు। ప్రతిదానిలోనూ కొంచెం అబద్ధం ఉండాలి. మొన్న నర్సయ్య తనకు అక్రమంగా కట్టినపన్ను యాభైరూపాయలూ తీసివేయవల్సిందని న్యాయమైన లెఖ్ఖలు దాఖల్‌చేసి, అర్జీ యిచ్చుకుంటే అందరూ యెరుగున్నసంగతేగా, కమీషనర్లంతాచేరి అప్పీలు కొట్టివేసి పన్ను ఖాయంచేశారు. అందులో ఎంతన్యాయం జరిగింది। ఇలాంటివే లక్షలున్నాయి. ఏమయ్యా గురయ్యనాయుడుగారూ మీ అభిప్రాయం ఏమిటి?

గుర :— నేనూ మీ అభిప్రాయంతోనే ఏకీభవిస్తాను. మనం ఎలాగో ఒకలాగు మంచి తనంగా ఉద్యోగస్థుల్ని సమాధానపరచుకోకపోతే వాళ్ళుపెట్టే తంటాలు మనం పడలేం.

పోలి :—మనకు కొంచెం నష్టంవచ్చినా న్యాయానికి కట్టుబడి వుండాలి. కొన్నివేళల్లో తప్పిపోయినా సాధారణంగా న్యాయమే అక్కరకువస్తుంది.

భీమ :— అమ్మమ్మా! అల్లా అనరాదు. ఈ వూళ్ళో మునిసిపల్ కమీషనర్ కందుల సోమిశెట్టి దగ్గిరవున్న డబ్బు, న్యాయంగా ప్రవర్తించే మీలో ఎవరివద్దనైనా వుందేమో చెప్పండి? లోకంలో డబ్బుంటేనే అన్ని గౌరవాలూనూ!

పోలి :—వెధవడబ్బు! అటువంటి డబ్బులేకపోతేనేం? గుణం ప్రధానంగాని డబ్బు ప్రధానం కాదు. డబ్బుమాటచెప్పవస్తే మనవూళ్లో బోగం చంద్రముఖి దగ్గర కావలసినంత డబ్బుంది.

భీమ :—నేను చెప్పింది ఒక్క డబ్బుమాటేకాదు. ఎందులోనూ బంగారానికి టంకంపొడి వేసినట్టుగా ఎంతనిజమైనా మధ్యనాలుగు అబద్ధాలు వేస్తేనేగాని అతకదు. న్యాయంగాపోతే అన్నీతంటాలే, అన్నీ విరోధాలే! కేవలం సత్యంతోకూర్చోక కొంచం లౌక్యంకూడా చూడాలి. మనపట్టీల జాబితాలు అందరికీ నిజమైనవి చూపిస్తామా? మన దగ్గిర వుంచుకునేదివకటి, యితరులకు చూపించటానికి తయారు చేయించేవి ఒకటీని! మనం రూపాయికి రూపాయిపావలావేసి, వచ్చిన వారికి రూపాయిబేడ కాడికి యిచ్చి అయినా ఎంతో లాభం చేసినట్టు కనపరచాలి. మళ్ళీ మునిసిపల్‌వారు ఎక్కువ పన్ను కట్టకుండా మనం రోజుకి యాభై రూపాయల సరుకు అమ్మితే, యిరవై రూపాయల సొమ్మే అమ్మినట్లు పైకి కనబరచి మన లోపాయీకారి లెఖ్ఖల్లో తగ్గించివేసుకొని రహస్యంగా ఉంచుకోవాలి. ఇటువంటి రహస్యాలన్నీ మనలో మనం ఉంచుకోవలసిందేగాని, పబ్లిక్కులో చెప్ప తగినవికావు.

పోలి :—మనం యిన్ని దగాలుచేసి యిన్నితంటాలు పడినా మనలో వక్కడిదగ్గర పట్టుమని పదివేల రూపాయలులేవు! ఎన్ని చెప్పినా ఎప్పుడూ న్యాయమే చివరికి అక్కరకు వస్తుందని నానమ్మకం! ఏం చంద్రమ్మా! అట్టే నిల్చున్నావ్? నీకూరగాయల వ్యాపారంలో లాభం బాగా వస్తోందా?

ఛంద్ర :—ఏమి లాభమండిబాబూ! అడ్డమైన గాడిదకొడుకులూవచ్చి మమ్మల్ని బెదిరించి, అదిరించి కాయా, గట్రా లాక్కుపోతూఉంటే మాకు అమ్మడానికి ఏముంటుంది? లాభమేముంటుంది? ఏమిటో పూర్వంనుంచీ చేస్తూన్న వృత్తి కావడంచేత విడవలేక యీడ్చుకొస్తూ ఉన్నాను. దిక్కుమాలినంత పన్నుంది. పన్నే చెల్లక పుస్తే, పుడకా తాకట్టుపెట్టి సర్కారుకు బాకీ లేకుండా చెల్లిస్తూవున్నా.

పోలి :—నీవు ఎప్పుడూ పుచ్చువంకాయలూ, చచ్చుబీరకాయలూ, కుళ్ళు అరటిపళ్ళూ దుకాణంలో ఉంచుతావుకాని మంచివి నీ దుకాణంమీద కనబడవు.

చంద్ర :—మంచిపళ్ళూ, కాయలూ గుమాస్తాలూ, యినస్పెక్టర్లూ, బంట్రోతులూ పదిమంది యెగబడి గంప దింపడంతోటే యెగరేసుకపోతారు. అమ్మడానికి చచ్చువీ పుచ్చువీ గాక మంచివి ఎలాగ ఉంటవండి బాబూ!

పోలి :—అలాకాదు. కూరలూ, పళ్ళూ నీవు మంచివితెస్తే మునిసిపల్ ఉద్యోగస్థులు అడిగి పోతారని నీవు యెప్పుడూ గంపలో పనికిమాలినవే పెడతావు.

చంద్ర :—రామ రామా! అలాచేస్తే పాపంరాదు బాబూ! మేనేజరుగారు యిప్పుడు పది రూపాయలు తెచ్చుకుంటేనేగాని పన్ను ఎక్కువ చేస్తామంటున్నారు. ఎవ్వరికైనా అర్జీ యిచ్చుకుంటే కార్యం వుంటుందా బాబూ?

పోలి :—నీవు వక్కతెవూ అర్జీ యిచ్చుకోవడంకాదు! పదిమందీచేరి మహజరుపెడితే లాభం ఉంటుంది. రామిశెట్టిగారూ! యిలాంటి అక్రమాలు జరుగుతూన్నప్పుడు మీరందరూచేరి మహజరువిషయమై ఏమైనా గట్టిగా ఆలోచించరాదు?

రామి :—ఉద్యోగస్థులమీద మహజరుపెట్టి మనం యీవూళ్ళో రెండురోజులు కొంప కట్టుకొని కాపరం చెయ్యలేం! అదుగో! మేనేజరుగారు ఆఫీసుకెళ్లడానికి వస్తున్నారు. మనమందరం ఇక్కడ గుంపుచేరివుంటే ఏదో గూడుపుఠాణీ చేస్తున్నామని కొంప తీసివేస్తాడు. అయన అసాధ్యుడు! వెళ్ళిపోదాం రండి! (వెళ్ళిపోతారు.)

---

## ద్వితీయ రంగం

### మునిసిపల్ ఆఫీసు

[మొదటి గుమాస్తా సుబ్రహ్మణ్యంగారు, రెండోగుమాస్తా వెంకయ్యనాయుడుగారు, మూడోగుమాస్తా అచ్చయ్యశాస్త్రిగార్లు ప్రవేశిస్తున్నారు ]

సుబ్ర :—వెంకయ్యనాయుడుగారూ! మేనేజరుగారు భోంచేసి పరుండి నిద్రతీసి విక్కి, నీల్గి తమ చిత్తంవచ్చినప్పుడు ఆఫీసుకువస్తారు. ఇప్పుడు పన్నెండుదాటినా యింకా రాలేదు. మనలను మాత్రం పొద్దున్న, మధ్యాహ్నంకూడావచ్చి పనిచేయమని తోమి వేపుకుతింటున్నాడు.

వెంక :—అవును! డబ్బూ దస్కం వస్తే దొబ్బడం ఆయన, అడ్డమైన వెట్టిచాకిరీ చెయ్యడం మనం! దొర గుడ్డివాడు గనక సాగిపోతోంది.

అచ్చ :—మునుపు తాను పదులు పుచ్చుకున్నా, నూర్లు పుచ్చుకున్నా, అడపాదడపా మన చేతుల్లోకూడా రెండు రూపాయలు పెడ్తేవాడు. ఇప్పుడు అవీలేవు!

సుబ్ర :—మొన్న టోలు కంట్రాక్టరుకు, నాలుగువందలు రిమిషన్ యిప్పించినప్పుడు బెత్తుల్లాగా నూరురూపాయలు ఒక్కసారి వాళ్ళో పోసుకున్నాడుగదా. అందులో సుబ్రహ్మణ్యంగారూ కూరకొనుక్కోండని వక్కపొవలాడబ్బులు చేతులో పెట్టిన పాపాన పోయినాడటయ్యా ?

వెంక :—ఆయన ఎంతవచ్చినా గళగ్రాహిగా మింగివేస్తూవుంటే. మనం చాటున గుటకలు మింగుతూ కూర్చుంటాం. ఏం ప్రయోజనం ? మీకు మగతనం ఉంటే ఏది? మాకుగూడా భాగంయివ్వలసింది. యివ్వకపోతే మీరు లంచాలు తింటూన్నసంగతి కమీషనర్ల నోటీసులోకి తెస్తామని మీలో యెవరైనా గట్టిగా అడగరాదు ? మీకు నోట్లో నాలుకలేదు. పైకి రావడానికి చేతగాక ముసుగులో గుద్దులాడతారు.

సుబ్ర :—మనం కమీషనరుతో చెప్పుకోడానికి వాళ్లకు ఒకటి దిక్కున్నదీ? అదిరించీ, బెదిరించీ అది చేయలేదనీ యిది చేయలేదనీ దొరతో పితూరీలుచెప్పి చీవాట్లు పెట్టిస్తాడు. ఇక కొందరు కమీషనర్లూ, యితనూ మమేకమే! డబ్బువచ్చేపని ఏదైనావుంటే యీ కమీషనర్లు వుండకుండా వుంధరు. ప్రజాక్షేమం విచారించవలసిన కమీషనర్లే యీప్రకారంగా పావలాకాడినుంచి వందలువందలు లంచాలుమేసి అక్రమాలు చేస్తూఉంటే. యిక ప్రజలకు ఏమిన్యాయం జరుగుతుంది?

అచ్చ :—ఇటువంటి కమీషనర్లను వేయడం గవర్నమెంటువారి తప్పిదం. ఈ కమీషనర్లలో యిలాంటి ఏడుపుండబట్టే మేనేజరు నిర్భయంగా జుట్టు విరబోసుకొని తిరుగుతున్నాడు!

సుబ్ర :—వెంకయ్యనాయుడుగారూ! పూర్వం పిటీషన్ ఎండార్స్‌మెంట్లమీద వచ్చే మామూలు మీకు వదిలిపెట్టేవారు కదండీ ? -

వెంక :—అది ఎంతండీ ? నెలకు నాలుగైనా తిన్నగా వచ్చేవికావు. జరూరైన పిటీషన్ వుంటే మామూలు పావలాయిచ్చి పేగిరం పట్టుకవెళ్తారు. అలిచ్చపు రూపాయలు నాలుగుకూడా యేడాదినుంచి ఆ మహానుభావుడే మింగుతున్నాడు. నా అదృష్టంగాగా వుంటే ఏ చాటునో నాలుగు రూపాయలు యేరుకోలేకపోలేను!

అచ్చ :—మీరు మొదటినుంచీ ఉన్నారుగనుక ఎలాగో నాలుగువాళ్ళు లాగగలరు. ఎందుకూ పనికిరాని నిరర్ధకుణ్ని నేనే! పోనీలెండి. నాకు దైవమిచ్చిన యీ పది రాళ్ళు చాలు. మేనేజరుగారికి బాగా దొరికేది ఎందులోనండి ?

సుబ్ర :—ఒకదానిలో ఏమిటి ? అన్నిట్లోను దొరుకుతుంది. రోడ్డు కంట్రాక్టులో సగానికి సగం లాభం! అందులో కమీషనర్లు సగమూ, ఈయన సగమూ కడతేరుస్తారు! కంట్రాక్టర్లందరికీ లోపాయికారీని యీ కమీషనర్లతోను, మేనేజరుతోనూ భాగం ఉంటుంది. కొత్తగా స్థలాలివ్వడంలో మరీ లాభముంటుంది. కొందరి కెంతో కాలం

నుండి పన్నులు యివ్వనివారిని, ఏమైనా పుచ్చుకొని, ఏళ్లకొద్ది ప్రాసిక్యూషన్ చెయ్యకుండా ఊరుకొని ఎప్పుడో రానిబాకీలక్రింద కొట్టివేస్తారు. ఆఖరుకు చచ్చు స్కూలు మాష్టర్లవద్ద రిసల్టుగ్రాంటులో కూడా నూటికి పదిరూపాయల చొప్పున కమీషన్ పుచ్చుకొందే గ్రాంట్లివ్వరు. ఇవిగాక ఈయన సొంతంగా కదతేర్చేవి యిటుకామలు, పెంకామలు. పెళ్ళిపందిళ్ళు మొదలైనవాటి బాపతు కావలసినంత ఉంటుంది. ఈయన దయతలచి చితాను ఎంత జమకడితే అంత ! లెక్క అడిగే వారెవ్వరూ ?

అచ్చ :—ఈ అన్నిబాపతులూ కలిసి నెలకు నూరు గిడతవండి ?

వెంక :—ఎక్కడినూరు ? నూటయాభైకి పైమాటేగాని తక్కువకాదు. ఈ బాబతులన్నీ నాచేతికివస్తే నూటయాభైకాడికి యివ్వడానికి నేను నాలుగు సంవత్సరాలు కంట్రాక్టు రాస్తాను. అదుగో, బడేసాహెబు! మేనేజరుగారి పెట్టె తీసుకొస్తున్నాడు. మనం నోరెత్తితే రిపోర్టు వెళ్తుంది. మీరు పని చూచుకుంటూ వుండండి.

---

## తృతీయ రంగం

### (లక్ష్మీనారాయణగారి యిల్లు)

[కమీషనర్లు లక్ష్మీనారాయణగారు, బుచ్చయ్యపంతులుగారు, గున్నయ్యనాయుడు, ఖాదర్ సాహెబుగారు, మేనేజరుగారు, ప్రవేశిస్తున్నారు]

లక్ష్మీ :—ఏమండీ మేనేజరుగారూ! రోడ్లమీద యెండుచెట్ల కర్రలన్నీ మీవరకేనా? మాకేమైనా నాలుగు కావిళ్ళు........

మేనే :—ముష్టికర్రలు! అవేమి కర్రలండీ. బాడిదచెక్కలూ, మర్రికర్రలూ, రావికట్టెలూను! కావలిస్తే పల్లపువీధిలోని రెండుచింతలు కొట్టించుకుపోరాదు! ఇందులో శానిటరీ యినస్పెక్టరుకు పదిమోపుళ్ళు పంపితేనేకాని శాంతించడు.

లక్ష్మీ :- అల్లాగే పంపిద్దాం. దాని ముండామోసిన కర్రలు. అల్లాగే పంపిద్దాం! రేపు దీపాల కంట్రాక్టరు తాలూకు పదిమంది చాకలివాళ్లనిపంపి సాయంత్రానికి ఆరెండు చెట్లూ కొట్టించండి. కర్రలుపోకుండా డివిజన్ బంట్రోతుల్ని దగ్గరుండమని ఆర్డరు వేయండి.

మేనే :- వాళ్ళంతా మహా పొగరెక్కి ఉన్నారు. మనమాటంటే బొత్తిగా లక్ష్యంలేదు.

లక్ష్మి :—వాళ్ళకు వెయ్యి పనులున్నాసరే! అన్నీ కట్టిపెట్టి ముందుగా యీ పని చెయ్యమనండి. కమీషనర్ల పనికంటే తక్కిన పనులు ఎక్కువండీ? చెప్పిన పని చెయ్యకపోతే నాతో చెప్పండి, వాళ్ళ రోగం కుదిరిస్తాను.

మేనే :—అలాటి పనులు చేయడానికి మీలో ఐక్యత ఉండాలి. మళ్ళీ వాళ్లు వచ్చి మీ ఇంటిచుట్టూ తిరిగి కాళ్లూ, కడుపూ పట్టుకోవడంతోటే మొహమాట పడతారు. ఏదీ? యిప్పుడు గంగులు మీద రిపోర్టుపెట్టి రేపటి మీటింగులో అతనిపని తీయించి వేయండి! మీశక్తి చూద్దాం?

లక్ష్మి :—సరే యీసంగతులు అటుంచండి. ముందు మనం వచ్చిన పని కానివ్వండి.

మేనే :—నాకు కబురంపిన పనేమిటో శెలవియ్యండి!

లక్ష్మి :—చల్లకువచ్చి ముంతదాచడమెందుకూ? బుచ్చయ్యపంతులుగారూ! మనం వచ్చిన పని చెప్పండి.

బుచ్చ :—మీరే చెప్పండి.

లక్ష్మి :—ఎవరు చెప్పినా వకటే కదండి. మీరే సెలవివ్వండి.

బుచ్చ :—అలాకాదు. మేమందరమూ మిమ్మల్ని కోరాము.

లక్ష్మి :—అలా అయితే వినండి. ఇప్పుడు మనకు వచ్చే లాభంలో నాలుగోవంతు మేనేజరుగారూ, మూడువంతులు కమీషనర్లూ పంచుకోవడంచేత మేనేజరుకి చాలా ఎక్కువ ముట్టుతోందని వీరంతా చెబుతున్నారు. కమీషనర్లకంటే మునిసిపల్ నౌకర్లకెక్కువ ముట్టడం నాకూ న్యాయంగాలేదు.

మేనే :—మీరనేమాటలు నాకర్థం కావడంలేదు.

లక్ష్మి :—మేమనేది మరేమీలేదు. మీకు ఎక్కువగా ముడుతూఉన్నది గనక నాలుగోవంతు మానివేసి, ప్రతిదానిలోను ఎనిమిదోవంతు పుచ్చుకోవడం న్యాయమని మాఅభిప్రాయం!

మేనే :—ఎవరిపుణ్యం బాగావుంటే వారికి ఎక్కువ దొరుకుతుంది. అందుకు మనం ఏంచేస్తాం? నాకు భాగం లేకుండా మీకు దొరికే బాబతులు ఎన్నిఉన్నాయి? దొర దగ్గర సంజ్ఞాయషీచెప్పి అన్నీ ప్యాస్ చేయించడం డ్యూటీ నాదిగనక నాకు యెక్కువ దొరకడం న్యాయమే! అందులో ఏమైనా అవకతవక జరిగితే తంటా దొరకు వస్తుందా మీలో ఎవరికైనా వస్తుందా? దొరకు మాటవచ్చినప్పుడు దొర యిలా ఎందుకు చేశావని మిమల్ని అడుగుతాడా, నన్నడుగుతాడా? జవాబుదారీ పనంతా నాది; ఇందులో మీరేమీ ఆశపడకండి,

లక్ష్మి :— అవేమి మాటలయ్యా! ఆ బెదిరింపులన్నీ కట్టిపెట్టండి. మాకు దొరక్కపోతే మీకుమాత్రం దొరుకుతుందా యేమిటి?

మేనే :—మర్మమంతా నాచేతులో ఉన్నప్పుడు, నావద్ద గడుసుతనం మాటలు చెప్పకండి. పిటీషనప్లూ మీరూ,ఏకమై సర్కారుస్థలాలు బేవారస్ స్థలాలూ, దాచివేసినవి ఎన్ని వున్నవి? అవన్నీ పైకితీస్తే మీరందరూ వక్కసారి శంకరగిరిమానాలు పట్టి పోవాల్సివస్తుంది. తాదేదారుగాఉండి దొరచెప్పినపనల్లా చేసేవాడికి నాజవాబుదారీ యేముంది? పోతే మీరుపోతారు, వారు పోతారుగాని నాకేమీ ఫరవాలేదు. ఎక్కడైనా పిల్లగండమూ, తల్లిగండమూ ఉంటుందికానీ, మంత్రసాని గండంఉండదు!

లక్ష్మి :—మేనేజరుగారూ! పోనీయండి. మీ అభిప్రాయం కనిబెడదామని అల్లా పరాచకానికి అన్నాంకాని, మీరు పుచ్చుకొమ్మంటేమాత్రం పుచ్చుకుంటామూఅండి? మీమాట దక్కించుకోలేకపోయారుగాని! సరే, ముందు జరగవలసిన పనేమిటో చెప్పండి.

మేనే :—అది ఏవిషయమో మీరే చెప్పండి.

లక్ష్మి :—సంవత్సరం ఆఖరుగనుక పన్నులు కొత్తగాకట్టేవి, రివైజ్‌చేసేవీ చాలాఉన్నవి. ఇందులో మనకు బోలెడుసొమ్ము దొరుకుతుంది. తర్వాత అప్పీళ్ళలో కావలసినంత సొమ్ము వస్తుంది ఇంకా అనేకబాపతులుఉన్నాయి. నేను నవ్వుతూ అన్నమాటలు నిజంగా పట్టుకుంటే ఉభయులకీనష్టం. కాబట్టి మనమంతా చురుకుగా పనిచెయ్యాలి.

మేనే :—ఇప్పుడు నేను దొరగారింటికి వెళ్ళవలసిన అర్జంటుపని వకటుంది. నాకు కష్టానికితగ్గ రాబడిలేదు. ఇందులో నాకు సగంవంతు వదిలిపెడితేనేకాని వీలులేదు. ఆలోచించండి. వెళ్లొస్తా. (అని వెళ్ళుతున్నాడు.)

# తృతీయాంకం

## ప్రథమ రంగం

(గోవిందరాజులుగారి ఇల్లు)

[శానిటరీ ఇనస్పెక్టరు, బంట్రోతు మల్లయ్య, గోవిందరాజుగార్లు ప్రవేశం]

శాని :—గోవిందరాజులుగారూ! మీరు సర్కారు ఉత్తర్వు లేకుండా అరుగులూ, గోడా కట్టించుకుంటున్నారు, పని ఆపు చేయించండి.

గోవిం :—లేదండీ. ఇదుగో నేను ఎండార్స్‌మెంటు పుచ్చుకొని మరీ పని ఆరంభం చేశాను. ఈ ఎండార్స్‌మెంటుకోసం, పదిరోజులు మేనేజరు యింటిచుట్టూ తిరిగి, తిరిగి వినుగుపుట్టి, యిలాంటి తగలాటం వస్తుందనే రెండురూపాయిలు సమర్పించుకొని, నిమిషాలమీద అర్డరు వేయించుకొని, మరీ వచ్చాను. కావలిస్తే ఎండార్స్‌మెంటు చూడండి!

కాని :—చూడనక్కర్లేదు. దాంట్లో మీస్థలంలో గోడా, అరుగులూ పెట్టించుకొమ్మని ఉంటుందికాని, అంతకంటే మరేమీ ఉండదు. మీరు సర్కారు స్థలం అక్రమించుకున్నారు. పని ఆపుచేయించండి. మల్లయ్యా! కూలివాళ్లతో పని మానివెయ్యమని చెప్పు.

గోవిం :—లేదండీ! మేము సర్కారుస్థలం ఒక్క అంగుళమైనా కలుపుకోలేదు. వీధి విశాలంగా ఉండాలె అని మాస్థలమే అరగజం వదిలిపెట్టి అరుగులు లోపలికి కట్టిస్తున్నాను. ఇదిగో మాపాత హద్దులు చూడండి.

కాని :—మా కదంతా తెలియదు. మీరు చూపించే పాత అనవాళ్ళు మీ రెప్పుడో మట్టివేసి పెంచినవికాని నిజమైనవికావు.

గోవిం :—స్పష్టంగా కనబడుతున్న గోడముక్కలు నిజమైనవి కావూ? ఏ అనవాళ్ళూ లేందీ అందరి స్థలంకంటే ముందుకు జరుపుకుని నెళ్లాళ్ళ క్రిందట వీధిమీదికి తోసుకొని వచ్చేలాగు పెట్టుకొన్న వెంకట్రావుగారి అరుగులు సర్కారు స్థలం కలియకుండా కట్టుకున్న నిజమైనవా? మా విషయంలో నిజమైన దానికి యింత తంటాలు పెడుతున్నారు దేనికండీ? వెంకట్రావుగారి విషయంలో ఎందుకు వూరుకున్నారు?

కాని :—ఇతరులమాట వదిలిపెట్టి, మీమాట మీరు చూచుకోండి. ఆయన సర్కారుస్థలం ఏమీ కలుపుకోలేదు. మారుమాటాడక తక్షణం పని ఆపుచేయించండి!

గోవిం :— న్యాయం బహుబాగా ఉన్నది!

కాని :—సర్కారు సొమ్ము తింటున్నందుకు మేము న్యాయంగా పనిచేయాలి. మల్లయ్యా! మనకు మాటలతో ప్రయోజనమేమిటి? వాళ్ళనుపిలూ. పేర్లు వ్రాసుకొని మేజిస్ట్రేటు వద్ద ప్రాసిక్యూటుచేద్దాం. మీరు మా మాట వినకుండా నిర్లక్ష్యం చేసినట్లయితే జుల్మానా పడటమే గాకుండా అరుగులూ గోడా పడగొట్టించివేస్తాం సుమండీ! (అని కొంతదూరం నడిచి, మల్లయ్యా! అని పిలుస్తాడు.)

మల్ల :—చిత్తం! వస్తున్నానండి – గోవిందరాజుగారూ! ఆయన రిపోర్టుచేస్తే మీకు పెద్దతంటావస్తుంది. ఏదో మాట్లాడి నాలుగురాళ్లు పారేస్తే సరిపోతుంది. ఏదో అలా చెయ్యండి.

గోవిం :—అయ్యా ! ఇనస్పెక్టర్‌గారూ ! మనవంది ! (అని త్వరగానడుస్తాడు)

శాని :—ఏమయ్యా ! ఇంతలోకే ఏంమనవి వచ్చింది ? నాకు అవతల చాలా పనుంది. త్వరగా చెప్పండి.

గోవిం : —తమకు ఏమైనా యిచ్చుకుంటాను. అభ్యంతరం చెప్పక పనిసాగించుకోడానికి సెలవిప్పించండి.

శాని :—ఈమాటే చాటుకు పిలిచి మొదటే చెప్తే! మేనేజరు తానుమాత్రం దొబ్బి మాకు సున్నాచుట్టదలచుకున్నాడూ ?-అతను మిమ్మల్ని బుట్టలో పెడితే, మేము లోక మంతటినీ బుట్టలో పెట్టేవాళ్లం. తెల్లవారిలేస్తే మాకిదేపని. చాలా పొద్దెక్కింది, ఆలస్యంచెయ్యక మీరేమిచ్చేదీ చటపటా చెప్పివేయండి.

గోవిం :—నాలుగు రూపాయలిస్తాను. తమరు అభ్యంతరం చెప్పక....

శాని :—పదిరూపాయలకు తక్కువ పుచ్చుకోవలసిందికాదు. అయినా తెల్లవారిలేస్తే ఒకచోటే తిరగవలసినవాళ్లం కాబట్టి ఒప్పుకున్నా.

గోవిం :—చిత్తం, అలాగే ! సెలవు.

శాని : —బంట్రోతుల మామూలు అందరికీ తెలిసిందే. నలుగురికి నాలుగు పావలాలు రూపాయికూడా మల్లయ్యచేతికివ్వండి. మల్లయ్యా ! పంతులుగారితో వెళ్ళి వీధి చివర కలుసుకో త్వరగా !

మల్ల :—చిత్తం ! (తిరిగివచ్చి శానిటరీ ఇనస్పెక్టర్ని కలుసుకొన్నాడు.)

శాని :—మల్లయ్యా ! ఊళ్ళో ఏవీధిని యెవరు గోడలూ, అరుగులూ పెట్టుకుంటున్నా తక్షణంవచ్చి మాకు రిపోర్టుచెయ్యి ! ప్రతి వీధీ, ప్రతిగల్లీ తప్పకుండా తిరిగి, ఎక్కడ యెవరు కాస్త గోడ యిటుక కదిపినా తక్షణం మాకు రిపోర్టు చెయ్యాలని బంట్రోతు లందరితోను చెప్పు! నీవు వెంటనే మాయింటికి రావాలిసుమా ! దొడ్లో పందిరి వెయ్యాలి. పాదులు పడిపోతున్నాయి. పందిరి జరూరు!

మల్ల :—వైస్ ప్రెసిడెంటుగారు నిన్నసాయంకాలం పడమటివీధిచూసి మహాగలీజుగా ఉంది, యివ్వాళ నన్ను దగ్గర ఉండి తుడిపించమన్నారు. ఆపని చేయొద్దండీ ?

శాని :—వెధవతుడుపు ! అందులో ఏం దొరుకుతుందని? ఏదోఒకటి సమాధానం చెప్ప వచ్చులే! నిన్న తెచ్చిన గడ్డి ఒక్కఆవుకే సరిపోయిందికాదు! ఇవ్వాళ నీవు సొంతంగావెళ్ళి పచ్చగడ్డి మోపులవాళ్లచేత తలా కాస్తా వేయించి పెద్దమోపు పట్టించుకురా. వాళ్ళు తిన్నగా వేయకపోతే రేపు వాళ్లపని పడదాం ! (అని వెళ్ళుతున్నాడు.)

# ద్వితీయ రంగం

[ గోవిందరాజుగారి చావిడి. ]

(కామిశెట్టి, గోవిందరాజుగారు, వెంకట్రాజుగారు, గంగయ్య నాయుడుగారు, వ్యాఘ్రావధానులుగారు, భీమారావు పంతులుగారు. మరికొందరు ప్రవేశిస్తున్నారు.)

కామి :—గోవిందరాజుగారూ! ఈరోజు మీటింగులో చేయవలసిన పనేమిటి?

గోవిం :—మరేమీలేదు. మునిసిపల్ కమీషనర్లను యేర్పరచుకునే అధికారం జనులకు యిప్పించవలసిందని పన్నులుచెల్లించే రేట్‌పేయర్లందరూ దస్కతులుచేసి గవర్నమెంటుకు మన గ్రామంనుంచి మహజరు పంపించాలి.

కామి :—తప్పకుండా! కమీషనర్లు మహా దోచుకొంటున్నారు నావద్ద........

భీమ :—ఇలాంటి సంగతులు పదిమందిలోను చెప్పకు. తంటావస్తుంది.

గంగ :—నాకు తెలియక అడుగుతాను, కమీషనర్ల నేర్పరచుకొనే అధికారం ప్రజలకు యిస్తే దానివల్ల మనకు వాలికే వైకుంఠం ఏమిటి?

గోవిం :—మదనయ్యగారూ, నాగభూషణరావుగారూ మొదలైన వారివంటి మంచి కమీషనర్లను మనం ఎన్నుకోవచ్చును, అటువంటివారు వస్తే అక్రమాలు ఏమీ జరగక, అందరికీ న్యాయం దొరుకుతుంది.

వ్యాఘ్ర :—అటువంటివారేగనక కమీషనర్లయితే ప్రజలకు ఏమీ లాభముండదు. వాళ్ళకు దేవబ్రాహ్మణ భక్తిసున్న. నేను మొన్న యిల్లుకట్టుకొంటూ వీధి అరుగులకోసం సర్కారుస్థలం రెండుగజాలు యిప్పించమని బతిమాలుకుంటే తమ పుట్టిమునిగిపోయినట్టు వేదం చదువుకున్న బ్రాహ్మణ్ణి అనైనాచూడక పీల్లేదన్నారు!

గోవిం :—వీధిలో స్థలాలు కలుపుకుంటే వీధి యిరుకై, బళ్ళువెళ్ళటానికి యిబ్బంది కాదటయ్యా?

వ్యాఘ్ర :—ఏమీ యిబ్బందిలేదు. వూళ్ళో మా వీధికంటే యిరుకుసందులులేవూ? నాకు రెండుగజాలు స్థలంయిచ్చినా వకబండి నిరభ్యంతరంగా వెళ్ళవచ్చు! సర్కారు స్థలంగాని, వాళ్ళతాతలు సంపాయించిందిగాని ఏమైనా భూదానంయిస్తారా యేమిటి?

గోవిం :—సర్కారు స్థలమైతే మాత్రం! యుక్తాయుక్తాలు అక్కర్లే!

వ్యాఘ్ర:—వాళ్ళ యుక్తాయుక్తాలు ఏడిచినట్టే ఉన్నాయి. బ్రాహ్మడికి భూమి యిచ్చుకోవడంకంటే యుక్తమేమిటి? అడిగితే నాలుగు రూపాయలు వాళ్ళమొహాన పారవేయడానికికూడా సిద్ధపడ్డాను. నాలుగు డబ్బులు తినిఅయినా పరోపకారంచెయ్యని

కర్కోటకులు వీళ్లు! బుచ్చయ్య పంతులుగారు మహారాజు! వాళ్ళు పూళ్ళోలేనప్పుడు నాకు అరుగులు శాంక్షన్ యిప్పించాడు. బుచ్చయ్య పంతులువారిలాంటి ధర్మాత్ములుంటేనే ప్రజలకు లాభముందికాని, దయాదాక్షిణ్యాలులేని నాగభూషణరావుగారిలాంటి కర్కోటకులుంటే ప్రజలకు ఏమీ లాభంలేదు.

గోవిం :—ఇప్పుడు జరుగుతూన్న అక్రమాలు లక్షలూ, కోట్లూ! బీదవాళ్ళు తాటాకు గుడిసెలు వేసుకోడానికి సెలవు వద్దనుంచి రోడ్లమరమ్మతు చెయ్యడానికి కంట్రాక్టు వరకు అన్నీ లంచాలే!

గంగ :—మీ మాటకు అర్థం వస్తున్నా. ఈ అక్రమాలన్నీ మనం యేర్పరచుకొన్నవాళ్ళే చేస్తే!

గోవిం :—మనం ఏర్పరుచుకున్నవాళ్ళు ఒక్కసారి అక్రమంచేస్తే రెండోసారి వాళ్ళను మళ్ళీ ఎన్నుకోము. ఆ భయంచేత వారు జాగ్రత్తగా ఉంటారు.

గంగ :—మీరు నూరు చెప్పండి! లంచాలు పుచ్చుకునే వాళ్ళుంటేనే మనకు లాభం. నాలుగురాళ్ళు తిన్నా మనకు ఉపకారం జరుగుతుంది. ఏమీ తినకపోతే వూరికే వూరంతా తిరిగి కమీషనరుగా వెట్టిచాకిరి చెయ్యడం వారికి కంచిగరుడసేవా యేమిటి?

వ్యాఘ్ర :—మీరు బహు బాగా అడిగారు! మీతో నేను పూర్తిగా ఏకీభవిస్తాను.

వెంక :—శాస్త్రిల్లువారు బహు తెలిసినవారు! అయన చెప్పినట్లే మేము నడుచుకుంటాం. మాకు యీ మీటింగు అక్కర్లేదు. వెళదాం పదండి :

గోవిం :—ఎన్నుకునే అధికారం మనచేతిలో వుంటే ఆ లంచాలు పుచ్చుకునే కమీషనర్లయినా మనం చెప్పినట్టు వింటారు. మహజరు తప్పకుండా పంపించాలి!

వ్యాఘ్ర :—మదనయ్యగారిని నాగభూషణరావుగారిని ఎప్పుడూ కోరకుండా ఉండేటట్లయితే, నేను మహజరుమీద దస్కతుపెడతాను.

భీమ :—మహజరు తయారుచేయించండి. రేపు మళ్ళీవస్తాము. (అందరూ వెళ్ళిపోతున్నారు.)

— తెర —

★

# వినోదతరంగిణి

## ప్రథమ రంగం

[ప్రదేశం - సోమయాజులుగారి యిల్లు]

(సోమయాజులుగారు ప్రవేశిస్తున్నారు)

సోమ :—(తనలో) వార్థకదశలో వివాహం చేసుకొన్నవాళ్ళ తిప్పలు యెక్కడా యిట్లాగే వుంటాయి. "ఆలుకాదిది వ్రాలు" అన్న సామెత యిప్పుడు అనుభవమౌతోంది. అయ్యో! అంతమంది వద్దంటూంటే వినకుండా బుద్ధిగడ్డితిని ఆరేళ్ళపిల్లను వివాహ మాడిన పాపఫలం అనుభవించక తీరుతుందా? దాని యవ్వనం అనుభవించాలని ఎంతవుబలాటపడినా, రాత్రి నాతో గదిలోవున్న నాలుగుఘడియలూ మొఖంముడుచు కొని, ఎక్కడలేని చికాకువచ్చి ప్రాణాలు బిగపట్టుకొని మాట్లాడకుండ యమ లోకంలో వున్నట్లుంటుంది. వశ్యౌషధం ఇస్తానని ఒకవేరు చేతులోపెట్టి మొన్నటి బైరాగివాడు నిష్కారణంగా నాలుగు రూపాయ లెత్తుకుపోయాడు. అదిగో సోమి దేవి చీపురుకట్ట పుచ్చుకొని వస్తూంది.

(సోమిదేవి ప్రవేశిస్తుంది)

సోమ :—ఓసీ! ఓసీ!! ఇట్లావచ్చి ఒక మాట వినిపో.

సోమి :—ఎప్పుడూ ఓసీ ఓసీ ఏమిటి? మనిద్దరిమధ్య రహస్యమేమిటి? మొగుడు చచ్చిన ముండలాగ రాత్రి, పగలు పనీపాటా లేక ఇల్లు పట్టుకొని వదలకు మహరాజు లాగ వీధిలోకి పోయి ఏదైన పని చూచుకోరాదు? మీరింట్లో లేకపోతే మీ పెళ్లాన్ని ఎవరూ ఎత్తుకుపోరులెండి.

సోమ :—ఏమే! నాతో మాట్లాడటమే బంగారంగా వుంది. నీమీద ఎంతో ప్రేమచేత దేవ వతార్చనకని యింటింటా తిరిగి నిత్యం మంచి మంచి పూవులు తెచ్చినా రోజూ వాటిని యింటి చూరులో పెట్టడమే కాని ఒక్కనాడైనా ముచ్చట తీరేటట్లుగా నేను చూస్తుండగా జడలో పెట్టుకోవు. నన్ను చూడగానే దయ్యం పట్టినట్లు తలవిర బోసుకొని అమ్మవారిలా కనపడతావు?

సోమి :—చాలు! చాలు!! ఈ పాటికి నీ చదువు చాలించు. నీ కెప్పుడూ నన్నాడి పోసు కోవడంతోనే సరిపోతుంది. అలిని వల్లనివానికి ఈల కూరలో ఉప్పు ఎక్కువైం దట. దైవమా! ఇంత ఈ పోరు ఎప్పుడు విరగడ చేస్తావో!

సోమ :—ఓసీ! కోపపడకే. ఎవరో వస్తున్నట్టున్నారు. ఉత్తప్పుడు లేకపోతే మానిగాని యితరులింటికి వచ్చినప్పుడైనా బిగ్గరగా మాట్లాడక, నా యెడల యింత పతిభక్తి చూపి పైకైనా నటించవే.

సోమి :—(మొఖాన మెటికవిరిచి) భక్తిగాదు; నీమొఖాన బండలుపెట్టాలి. ఎవరో వస్తు న్నారుగాని లేకపోతేనా ఈ చీపురుగట్టపెట్టి పెద్ద పూజచేసి వదిలిపెట్టుదును. (అని లోపలికి వెళ్ళింది)

(అవధానులు ప్రవేశిస్తూ)

అవ :—సోమయాజులుగారూ! లోపలేదో పనిమీద వున్నట్టున్నారు. ఒక్కసారి నడవ లోకి వస్తారూ ?

సోమ :—వస్తున్నా.

అవ :—ఏమండోయి! ఇవాళ ప్రొద్దున వీధిలోజరిగిన విపరీతం చూచారా ?

సోమ :—ఏమి విపరీతం నాయనా ? నేనే పాపకర్మ మెరుగను. తెలివిమాలిన మన సోమిదేవి ఏమైనా—

అవ :—కాదు! కాదు!! ఎవరో పిల్లనుకని చంపివేసి రాత్రివేళ మన గుమ్మానికెదురుగా పారవేశారు.

సోమ :—(అదరిపడి) నాయనా! అంత చేటుకాల మెవ్వరికొచ్చింది ?

అవ :—మీరెఱుగరూ ? (మెల్లగా) భీమరావు పంతులుగారి మరదలేమో కని పారవేసిం దని ఇరుగుపొరుగు అమ్మలక్కలు చెప్పుకుంటున్నారు. ఇదివరలో పంతులుగారు సభకు వెళ్ళినతరువాత రోజూ మధ్యాహ్నంపూటపోయి వేదాంతం చెప్పివచ్చేవారు గామీరు!

సోమ :—వెనక నేనే చెప్పేవాణ్ణి. కాని ఈమధ్య నావలె వట్టి మాటలచేతనే కాకుండా అనుభవంచేత కూడ వేదాంతమును చెప్పగల పడుచు శాస్త్రి ఒకడు ప్రవేశించినందున పదినెలల నుండి నాకు ఉద్వాసనమయింది. ముండలు తిని తిన్నగా వుండలేక యిలా కాని పనులు చేస్తున్నారు.

అవ: —అదంతా మీ వుపదేశ మహత్యమే బాబు! అన్ని సౌఖ్యాలు అనుభవించి, అరవై ఏళ్లు దాటి సమస్తం తెలిసిన మీవంటి పెద్దలు సహితము పెళ్లిచేసికొని సుఖపడ

గోరుతుంటే మూడేండ్లకే మగడు పోయిన, పుష్పపులును తిను దేహములతో నడి వయస్సులో నున్న, బాలవిధవలు కామబాధకు లోబడ్డం ఆశ్చర్యమా ?

సోమ :—ఆ ముండల సంగతి మనకెందుకు గాని నే ముసలితనంలో పెళ్లి చేసుకొన్నా. మా సోమిదేవి వంటి పతివ్రత మరొకటుండబోదు సుమా! దాని అడకువ, దాని పతిభక్తి ఏమని చెప్పను ?

అవ :—అవునవును. మీరు చెప్పకపోతే పొరుగునున్న వాడికి నాకుతెలియదూ ? ఇప్పుడు చంద్రయ్య మీ వద్ద వేదం చదువుకొనడానికి వస్తున్నాడా ?

సోమ :—చదువు మానివేశాడు గాని మా యిల్లు ఎప్పుడూ వదలడు. వాడందరి శిష్యుల వంటివాడు కాడు. పరమయోగ్యుడు!

అవ :—అవునవును. అతడు చీకటికైనా భయపడక రాత్రులు కూడ మన యింటివద్దనే తరచు వుంటం చూస్తున్నాను.

సోమ :—సోమిదేవి నేను లేనప్పుడు యింట ఒక్కతే వుండలేదని రాత్రిం బగళ్లు దానికి సహాయంగా మా యింటివద్దే వుంటాడు. మన ఊళ్లో దొంగలు భయం ఎక్కువకనుక భద్రతకోసం తలుపు వేసుకొని యింట్లో కూర్చుంటారు. వాడి దగ్గఱ ఒక్కదుర్గుణమైనా లేదు సుమా! నీ పాదాల సాక్షిగా నామాట నమ్ము ! ఒకరి నొకరైనా కన్నెత్తి చూడరు.

అవ :—ఆ సంగతంతా నాకు తెలుసు. మీరు వేరే శలవియ్యాలా?

సోమ :—దాని కేమిటి గాని మొన్నటి సంగతి ఏమిచేశావు ? అదుగో ఎవరో బంట్రోతు వచ్చి నిన్ను పిలుస్తున్నాడు.

(బంట్రోతు ప్రవేశించి)

బంట్రోతు :—ఎవరయ్యా అవధానులుగారూ! తహశ్శీలుదారుగారు మీ యింటి వద్దు న్నారు. పిలుచుకు రమ్మంటున్నారు. రండి !

అవ :—సోమయాజులుగారూ! మీరు కూడ రండి.

(అందరు వెళ్లిపోతారు)

## రెండవ రంగము

(అవధానులగారి చావడి. తహశ్శీలుదారుగారు, గుమాస్తా కూర్చుని వుండగా అవధానులు, సోమయాజులు, బంట్రోతు ప్రవేశిస్తున్నారు)

తహ :—ఏమయ్యా అవధానులుగారూ! ప్రొద్దున మీ గుమ్మము వద్ద నున్న శిశువును మీరు బలవంతంగా చంపారా! లేక దానంతటదే చచ్చిందా?

అవ :—(వణకుచు) నేనే పాపకర్మమెరుగను. ఎవరో గిట్టనివారు మా యింటికి కానిస్టేబులును పొద్దున - (తడబడుచున్నాడు.)

తహ :—నీ తడబాటు చూస్తుంటే నీవు నేరం చేసినట్టే కనుపడుతున్నావు.

గుమా :—అవధానులుగారూ! మీకు వచ్చిన భయంలేదు. నిజం ఒప్పుకొని చెప్పండి.

అవ :—భీమారావుగారి మరదలు-

గుమా :—(చేయెత్తి అదలించి) ఈ పాటి చాలించు.

సోమ :—(మెల్లగా) నీ పుణ్యమాయెను ఊరుకోవయ్యా! పెద్దమనుష్యులకు నిష్కారణంగా అవమానం.

తహ :—అవధానులూ! సగం చెప్పవచ్చి వూరుకున్నావేమయ్యా?

అవ :—అయ్యా! మరేమీ లేదు.

తహ :—లేకపోవడమేమిటి? భీమారావుగారి మరదలని మొదలు పెట్టావుగా. అదేమిటో పూర్తిగా చెప్పు. తిన్నగా చెప్పకపోతే చేతులకు సంకెళ్లు పడతాయి.

సోమ:—(చెప్పవద్దని చేసైగ చేస్తున్నాడు.)

అవ :—(కొంచెె మాలోచించి) భీమారావుపంతులుగారి మరదలు బుద్ధిమంతురాలని చెప్పబోయి తమరు అశ్రద్ధగా వున్నారని వూరుకున్నాను.

తహ : —నేను నిన్ను శిశువు సంగతి అడుగుతుంటే యీ సంగతెందుకు?

అవ:—చిత్తం! చిత్తం!!

తహ : —మీరు పునర్వివాహాలు కూడవంటారు. అవి లేకపోబట్టే గదా ఇట్టి ఘోర కృత్యాలు నిత్యం జరుగుతున్నాయి. ఎంతో శ్రోత్రియులమని చెప్పుకుంటూ నీ వంటి సోమయాజుల పేళ్లవారే ఇటువంటి రంకుముండలచేత లక్షవత్తుల వ్రతాలు మొదలైనవి చేయించి, సంకోచించక హస్తోదకాలు పుచ్చుకొని, ముందుగా భోజనానికి సిద్ధపడతారు. నీవంటి ముసలివాళ్ళు కూడా మూడేళ్ల పిల్లలను పెండ్లి చేసుకుంటుంటే వయస్సులో నున్నప్పుడు పెండ్లి చేసుకోడానికి స్త్రీల గ్రహచారమేం కాలింది?

సోమ :—పూర్వజన్మంలో చేసుకున్న పాపంచేత స్త్రీలు విధవలౌతారు. చేసుకున్న దెవ్వరికి అనుభవించక తప్పుతుంది ?

తహ :—ఈ స్త్రీలు పూర్వజన్మలో ఏపాపం చేస్తే దానికిప్పుడీ అవస్థ వచ్చిందో మీకేమైనా తెలుసా?

సోమ :—నాకు తెలియదు.

తహ:—అది తెలియకపోతే మానిగాని పూర్వజన్మలో మీరెవ్వరో. ఇప్పుడు మీకీజన్మ ఎందుకు వచ్చిందో మీ సంగతైనా మీకు తెలుసా?

సోమ:—అది అంతకు ముందే తెలియదు.

తహ:—ఈ బాలవిధవలందరు పూర్వజన్మలో నీ వంటి శుద్ధశ్రోత్రియులు. పునర్వివాహము కూడదని పూర్వజన్మలో స్త్రీలను క్షోభపెట్టిన పాపఫలం ఈ జన్మలో ఇలా అనుభవిస్తున్నారు. అప్పటి వితంతువులే ఇప్పటి మీరూపాల్తో అవతరించి స్త్రీపునర్వివాహాలు కూడవని మీరు పూర్వజన్మలో వారిని పెట్టినబాధకై మళ్ళా కసి తీర్చుకుంటున్నారు.

సోమ : —తమరీలాగు సెలవీయకూడదు.

తహ :—ఊరికే నవ్వులకన్నాను. ఈ జన్మలో మన దోషంచేతనే స్త్రీలు దుఃఖాన్ననుభవించడం ప్రత్యక్షంగా కనపడుతుంటే నీవు పూర్వజన్మ పాపమనెదవేమయ్యా?

సోమ: - తమవద్ద నేనేమి మాట్లాడగలను?

తహ :—సోమయాజులుగారూ! మేము భీమారావు పంతులుగారి మరదలు సంగతి విచారణ చెయ్యాలి. మీరు ముందుగావెళ్ళి ఆ యేర్పాటులు చేయించగలరా?

సోమ:—చిత్తం (అని వెళ్లాడు.)

తహ:—సోమయాజులు వ్యభిచారం వల్ల దోషం లేదని మెట్టవేదాంతాలు బోధించి భీమారావుపంతులుగారి మరదలివద్ద నాల్గువందల రూపాయిల సొమ్ము కాజేసినాడటగా.

గుమ:—అవును ఆవేదాంతమే ఇప్పుడీయన భార్యకు చక్కగా అక్కరకు వచ్చింది.

తహ:—చాల ప్రొద్దెక్కింది. మనము వెడదాము రండి.

(అందరు వెడతారు)

## మూడవ రంగము

(సోమయాజులు, భార్య ప్రవేశిస్తున్నారు)

సోమ:—ఏమే తలుపువద్ద ఎంతోసేపు పిలిచినా పలికేవు కాదు. కేకలువేసి వేసి గొంతుక బ్రద్దలైంది.

సోమి:—నేను లోపలేదో పని సందడిలో వున్నాను. మీ పిలుపు నాకు వినపడలేదు.

సోమ:—తహాశ్శీలుదారుగారు మన యింటికి వస్తామన్నారు. మేమిక్కడ వేసుక కూర్చున్న పెద్దచాప ఏమైంది?

సోమి:—మీ చాప కనిపెట్టుకుండటం తప్ప నాకు వేరేపనేమి లేదా?

సోమ:—నేను తలుపుదగ్గర పిలిచేటప్పుడు బుర్రున చాపచుట్టిన చప్పుడైంది. ఒకవేళ చాపచుట్టి లోపలపెట్టావేమోనని అడిగాను.

సోమి:—అన్ని చప్పుడూలు మీకు వినపడతాయి. ఆగదిలో చాపలేదు. తలుపు తీయకండి. మీరు వీధితలుపుతీసి వెళ్ళినపుడు చాప ఎవరెత్తుకపోయారో!

సోమ:—(గదితలుపుతీసి) మూల చాపచుట్ట కనుపడుతోందే.

సోమి:—మీకాచాప పనికిరాదు. సుబ్బారావుగారింటికెళ్ళి మంచిచాప తెచ్చుకోండి.

సోమ:—(చాపచుట్ట చేతితోపట్టుకొని లాగుతూ) ఏమే చాపచుట్ట ఎంతలాగినా రాక, బరువుగావుంది.

సోమి:—(అడ్డంవచ్చి చాపచుట్ట పట్టుకొని) ముసలివారయినారు. చాపఎత్తడానికైనా మీచేతిలో సత్తువలేదు. నాకు చాపతో పనుంది. ఇంకోచాప తెచ్చుకోండి.

సోమ:—(పైనుంచి చాప చుట్టలోకి తొంగిచూచి) ఇందులో ఎవడో కూర్చున్నాడు. ఓరి దొంగగాడిదకొడకా! లోపల కూర్చున్నావేం? పైకి లేచిరా!

సోమి:—ఊరికే అల్లరిచేయకండి. నాకు కొంచము తలనొప్పివచ్చి యీ వైద్యుణ్ణి పిలిపించాను.

సోమ:—ఓరి కుక్కలకొడకా! ఏమిరా ఇంకా లేచిరావు?

వైద్యుడు:—(లేచివచ్చి) మాటలు మిగలబోకు. నీభార్యకు వైద్యము—

సోమ:—లంజకొడకా! వైద్యముకోసం వచ్చివ గాడిదకొడుకువైతే చాపచుట్టలో దూర వలసినపని నీకేం వచ్చిందిరా?

సోమి :—తలనొప్పితో బాధపడుతూంటే వుపకారానికి మందియ్యవచ్చిన పెద్దమనిషిని బ్రతిమాలుకోవడంపోయి నిష్కారణంగా తిడుతున్నారేమిటి? మీరసలే అనుమానపు మనుష్యులని చాపచుట్టలో—

సోమ :—తాఁ. ఊఁ. నన్నెవరోపిలుస్తున్నారు. (వైద్యుడువంకచూచి) పెద్దమనుష్యులు రాబట్టి యిప్పటికి బ్రతికిపొయ్యావు. వెళ్ళు—వచ్చె వచ్చె. కేకలు వేయకండి! (అని చాపపట్టుకొని వీధి అరుగువద్దకు పరుగెత్తుతున్నాడు.)

(తహశ్శీలుదారు వగయిరా ప్రవేశిస్తున్నారు)

తహ :—మేము వచ్చేటప్పటికే చాప వేయించి వుంచమంటె వచ్చింతరువాతకూడ యింత ఆలస్యము చేశావేమయ్యా.

సోమ :—చిత్తం. చిత్తం. లోపల మా సోమిదేవికి కాస్త జబ్బుచేస్తే వెళ్లి వైద్యుణ్ణి తీసుకొచ్చాను. కొంచమాలస్యమైంది. క్షమించండి. (అనిచాపవేస్తాడు)

తహ :—(కూర్చుని) కూర్చోండి. అంతాకూర్చోండి! (అంతా కూర్చుంటారు) వైద్యుడు గారూ! అదేమిటి తలనిండా ముసుగువేసుకొని దొంగకుమల్లె తలొంచుకుని పారిపోతున్నావేమి? ఒకసారిలారండి.

వైద్యుడు :—చిత్తం. (అని వచ్చి కూర్చుంటాడు)

తహ :—సోమయాజులు గారింటికి ఏమి పనిమీద వచ్చావయ్యా?

వైద్యుడు :—కాస్త సోమయాజులుగారితో పనుండివస్తే ఆయన యింట్లో లేనందున వచ్చేదాకా వుండి, మాట్లాడి వెళుతున్నా.

తహ :—దానికేంగాని సోమయాజులుగారితో పనుండివస్తే నాకేం? సోమదేవమ్మగారితో పనుండివస్తేనాకేం? ఈ వీధిని జరిగిన శిశుహత్యవిషయం నీకేమైన తెలుసా?

వైద్య :—నాకేమీ తెలియదు.

సోమ :—ఈయనకు తెలియందేమిలేదు, కడుపు దిగబడటాని కీయనే మందిచ్చారు.

వైద్య :—ఈయన పురాణం చెపుతున్నపుడు వెనకొకమాటు భీమారావుపంతులుగారి మఱదలికి మందివ్వవలసిందని నన్ను చాల బ్రతిమాలుకొన్నాడుగాని నేనాపనికి ఒప్పుకోలేదు.

( బంట్రోతు ప్రవేశము )

బంట్రోతు :—భీమారావు పంతులుగారు బసలోలేరు. వారి మఅదలుగారికేమో పదిరోజుల నుండి జబ్బుగావుండి మంచముపట్టిందట.

తహ :—ఐతే భోంచేసి మళ్ళావద్దాము. మధ్యాహ్నం వీరందరిని మాయింటివద్ద హాజరుపెట్టు.

బంట్రోతు :—చిత్తం.

( అందరూ వెళతారు. )

## నాల్గవ రంగము

( తహశీలుదారుగారి పడకగది. తహశీలుదారుగారు, ఆయన భార్య ప్రవేశిస్తున్నారు)

తహ :—నీవు ఏమాట చెప్పినా వింటానుగాని యిలాంటి మాట లెప్పుడూ నాతో చెప్ప బోకు.

భార్య :—ఈ విషయంలో నా మాట వినక తప్పదు. భీమారావు పంతులుగారు సోమయాజులు చేత వందకాసులు పంపారు. వెయ్యిరూపాయలు ఎంతకాలం సంపాదిస్తే వస్తాయి? మీవద్ద 15 రూపాయల జీతానికున్న గుమాస్తా నాలుగువేల రూపాయలు బెట్టి మేడకట్టాడు. ఆయన కోడలు మొన్న పెట్టుకొచ్చిన నగలుచూస్తే నాకెంతో ముచ్చటైంది. నాకు నూరువరహాల గుల్లలైనాలేవు. మీరుతెచ్చేజీతం కూటికి గుడ్డకు సరిపోతుంది. నిన్న మొన్న చిన్నచిన్న ఉద్యోగములలో ప్రవేశించిన వాళ్లంతా ఇష్టమొచ్చినట్లు సంపాదించి భార్యలకు, బిడ్డలకు వంటినిండా నగలు దిగవేస్తున్నారు. మీరింతకాలం నుండీ పనిచేస్తున్న ప్రయోజన మేమిటి? నాకు పెట్టుకోవడానికి మంచి నగలేదుగదా! పిల్లలకు చిన్నమెత్తు బంగారపు పూసకూడాలేదు. రేపు కాస్త కాలులో ముల్లుగుచ్చుకుంటే తరువాత నా బ్రతుకూ పిల్లల బ్రతుకూ ఏమి కావాలి.

తహ :—నీవెన్ని చెప్పినా రాచకార్యవిషయాల్లో నీమాటవినను. మనకు ధనము, దేహము శాశ్వతం కాదు. నిత్యమైనవి పేరు, ప్రతిష్ఠలు.

భార్య:—మీరు నా మాట వినకపోతే ఈ రాత్రికి ఏ నుయ్యో, గొయ్యో —

తహ :—చావడిలోనికెవ్వరో వచ్చినట్లున్నారు నీవు లోపలికి పో !

భార్య :—నామాటవినకపోతే నేనన్నంతపనీ చేసితీరతాను! (అంటూవెడుతుంది.)

తహ :—స్త్రీలు విద్యలేని హేతువుచే యుక్తాయుక్తాలు తెలియక పశుతుల్యులాండ్రైనందున కదా యింతమూర్ఖంగా ప్రవర్తించుట! ఇప్పుడీ పాపాని కొడికట్టకుంటే అది తప్పక చెప్పినంతపని చేస్తుంది. ఏంచెయ్యాలిప్పుడు? నాన్నగారున్నప్పుడిదే గొడవ! ఎలాగో తప్పించుకొని బయటపడ్డాననుకుంటే దీంతో చావువచ్చింది.

( భీమారావుపంతులుగారు, గుమాస్తా ప్రవేశిస్తున్నారు )

భీమ :—(తహశీలుదారుగారి కాళ్లమీదపడి) మీరెలాగైనా మాపరువు నిలబెట్టాలి. ప్రస్తుత వ్యవహారంలో మాకేమైనా అవమానంవస్తే మా కుటుంబమంతా కట్టగట్టుకొని ఒక్కసారి గోదావరిలో పడవలసిందే కాని యీ ప్రజలలో తలెత్తుకుని తిరగలేం.

తహ :—మీరు కాళ్ళు వదలండి. నాచేత నయినంతవరకు యీ వ్యవహారంలో న్యాయమే చేస్తాను.

గుమ :—అలాకాదు. తమరిందులో వారిని రక్షిస్తానని అభయహస్తమివ్వాలి.

తహ :—మంచిది, వెళ్లిరండి!

గుమ :—పంతులుగారూ! అయ్యగారివాక్యం రామవాక్యం. హరిహరాదు లడ్డొచ్చినా వారిమాటకు తిరుగులేదు. అయ్యా! సెలవు పుచ్చుకుంటాం.

భీమ :—అయ్యా! సెలవు పుచ్చుకుంటాం.

(అందరు వెళుతున్నారు.)

★

# జమాబంది

## ప్రథమ రంగం

( కరణం రామయ్యగారు, కాపుల దొరయ్య, మునిస్వామియు, వీరాస్వామియు ప్రవేశించుతున్నారు. )

కర :—దొరయ్యా! నీవు గ్రామానికి మునసబువుగదా! తవ్వల తాతయ్య వద్దనుంచి నాలుగు రూపాయలు వసూలుచేయలేక పోయావే!

దొర :—ఆఁ, వాడు వట్టి బండముండాకొడుకు! నేనేంచెయ్యనండీ. అన్నీ యిప్పుడే వచ్చాయి. అవతల గ్రామంలో దస్తుచేసి డెల్టా సూపరెంటు మొహాన్న పోస్తేనేగాని పొలాల్లోకి చుక్కచుక్క నీరురాదు. ఇవతల జమాబంది ఖర్చులకు దస్తుచెయ్యాలి. గోరుచుట్టుమీద రోకటిపోటు పడ్డట్టు సర్కారు కిస్తీకూడా యిప్పుడే రావాలీ!

కర :—వీరాస్వామీ! నీవు డెల్టా సూపరెంటుగారి వద్దకుపోయి, యిప్పుడు జమాబంది తొందర వచ్చింది. యీ తొందర అణిగిందాకా వెలరోజులు ఓపికచేస్తే సొమ్ము దాఖలుచేసుకుంటాము. ఈలోపల నీళ్ళు వదిలిపెట్టవలసిందని అడగలేక పోయావోయ్!

వీర :—ఆ మారాజు దగ్గిర అపప్పుడకదండి! చిల్లిగవ్వ తక్కువ కాకుండా సొమ్ము అక్కడబెట్టి మరీ మాట్లాడమంటాడు. నిరుడు ఏమైందనుకున్నారు? మామూలులో వక రూపాయి తక్కువయిందని, నేను మళ్ళీ వూరికివచ్చి పట్టుకవెళ్ళి యిచ్చిందాకా, చేలు యెండిపోతున్నా, గిద్దెడు నీళ్ళు వదిలిపెట్టాడుకాడు ఆ మహానుభావుడు. రైతులందరూ గొల్లున గోలపెట్టారు. ఎవరికి కాస్త వెనకాముందైనా, తిరుపతి వెంకటేశ్వర్ల ముడుపు ముందుగా చెల్లించుకోక తప్పదుగా! మనల్ని యిలా ఏడిపించి సొమ్ముపుచ్చుకుంటారాఅండీ, వాళ్లూ యిలాగే పైవాళ్ళకి లంచాలు పోయ్యాలటగా.

కర :—మనం వాళ్లకు లోకువైతే, వాళ్లూ పైవాళ్లకు లోకువ. ఇప్పుడు హుజూరున ఎవరో మేనేజరు ఉన్నాడట. అతను డెల్టా సూపరెంట్లు మొదలైన వారి వద్ద లంచాలు చాలా దోచుకుంటూ వుంటున్నాడట! అన్నవేళకు లంచం సొమ్ము దాఖలు చేయలేకపోతే మొన్న ఒక డెల్టా సూపరెంటును తీసివేసి, రెండువందల రూపాయలు పుచ్చుకొని, ఆపని మరి వకడికి వేయించాడు. ఇది జరిగి రెండు నెలలైనా

కాలేదు. ఇంతలోకే యేదో తప్పువచ్చిందని యీ కొత్తవాణ్ని కూడా తీయించివేసి మూడువందలు దొబ్బి, మరొకరికి వేయించాడు. శ్రీ రంగ రంగా! హుజూరులో మరీ అన్యాయంగా వుంది.

ముని:—దెబ్బా సూపరెంట్లకు రోగం కుదరాల్సిందే. మొన్న నేను పాడికి మాపెద్దావును తోలిపెట్టినానుకానని మాదొడ్డెదు పశువుల్ని కాలువగట్టు తొక్కినవనే వంకపెట్టి, యీనెల్లో మూడుసార్లు బందెలదొడ్లో పెట్టించాడు. నాకు యాభైరూపాయలు వదిలాయి. ఈ పాట్లు పడలేక నిన్న ఉదయాన మాఆవును తోలించేశాను. ఆవును పంపించేటప్పుడు నాపెళ్ళాం పెద్దపెట్టున ఏడ్చింది. నిరుడు యీదినాల్లో దాన్ని నూరురూపాయలుపెట్టికొన్నా; పూటకు మూడుశేర్ల పాలు యిచ్చేది. ఈ ఉద్యోగస్తుల మూలంగా మంచి వస్తువుకూడా కొనుక్కోవడానికి నోచుకోలేదుగదా!

కర:—దాని తల్లిశిగగోసినావు! అది పోనేపోయింది. ముందుగా యీ జమాబందిమాట చూద్దూ! మొదట ఈ గండం గడిచి పిండం బయటపడితే, పిమ్మట అన్నీ చూసుకోవచ్చు. జమాబంది ఖర్చులు నాలుగువందలూ యివ్వాళ రేపట్లో మన గ్రామంలో వసూలయ్యే ఉపాయం చూడు. నీ పెత్తందారీతనం చూద్దాం!

ముని:—మరేం పర్వాలేదు! వసూలౌతాయి నాదీ పూచి. 'ఊరిమీద వూరు పడ్డా' కరణం మీద కాసుపడదు; మొత్తంమీద మీకిందులో వందరూపాయలు మిగుల్తాయి. ఒక దమ్మిడీ చేతికి తగలదు.

కర:—తర్వాత మెల్లిగా రాబట్టుకోవచ్చుగాని మోతుబరీ రైతులు మీరు తలా పది రూపాయలూ వేసుకొని రేపు నా చేతికి యివ్వండి.

వీర:—ఈ జమాబంది ఎప్పుడు విరగడౌతుందోగాని గ్రామంలో మహా అల్లరిగా ఉంది సుమండీ! బంట్రోతు వాళ్ళు వూరిమీదపడి యీడిగవాళ్ల యిళ్లల్లోను, చాకలివాళ్ళ యిళ్ళల్లోను దూరి కోడిపిట్టల్ని, కూరగాయల్ని, బలవంతంగా లాక్కుపోతున్నారు. వూరంతా లబ్బున మొత్తుకుంటున్నారు. పాకలనిమిత్తం, పందిళ్ళనిమిత్తం, మన వూళ్లో తాడిచెట్లన్నీ మోళ్ళయిపోయాయి. పుల్లలకిం ద సగం తుమ్మచెట్లుపోయాయి. పదిహేను రూపాయల గుమాస్తా కాడినుంచీ ప్రతివారి యింటివద్ద పందిరి వెయ్యాలి; తోరణాలు కట్టాలి. సరేగానండి. వూరూరునుంచీ యిలా ప్రతిరోజూ ప్రతి యింటికీ పెరుగుకావిళ్లూ పాలకావిళ్లూ, కర్రలకావిళ్లూ, కూరలకావిళ్లూ వెళ్తావి కదా, యివన్నీ ఏంచేస్తారండీ?

కర:—ఏం చేస్తారా? తమకు కావలసినవిపోగా మిగిలినవి బసదిగిన యింటివాళ్లకు యిచ్చేస్తారు. పుల్లలూ మొదలైనవి మళ్లీ జమాబంది వచ్చేదాకా ఏటికి యేడాదీ సరిపోతయ్. అందుచేతనే పరదేశివస్తే బసయివ్వని ముండాకొడుకులందరూ మా

యింట్లో దిగాల్సింది. మాయింట్లో దిగాల్సిందని ఎదురుగుండా వెళ్ళి ఉద్యోగస్తుల్ని తీసుకవచ్చి యిళ్లల్లో దింపుకుంటారు. ఏమీ లాభంలేకపోతే వారిమొహం కంచి గరుడసేవా యేమన్నానా వూరికే బసలివ్వడానికి?

వీర :—చూడిండి! ఉద్యోగస్థుల వెచ్చాలనిమిత్తం కోమట్లకురాసే చీట్లు బహుచిత్రంగా ఉంటవి. ఎవరికి ఆ వస్తువుకావాలో ఎక్కడా పేరుండదు. ఎవరికి చీట్లు వ్రాశారో ఆ కోమటి పేరుండదు సరికదా, కింద దస్కత్తేనా ఉండదు! కరణంగారూ! కోమట్లు మనల్ని దగాచేసి దొంగచీట్లురాసి మనవద్ద సొమ్ముపుచ్చుకుంటేనో? అడుగున దస్కతా, వల్లకాడా?

కర :—గుండెలున్నాయ్? కోమటివాడు ఒక్కనాటికి అలా దగాచేయడు. పట్నవాసపు కోమట్లయితే చేస్తారేమోగాని పల్లెటూరి కోమట్లు చెయ్యలేరు.

ముని :—అయ్యా కరణంగారూ! ఉద్యోగస్తులు మనం తినేదానికంటే మూడురెట్లు ఎక్కువ భోంచేస్తారా? పద్దుల్నిబట్టి వక్కొక్కరికీ రోజుకి మూడు శేర్లబియ్యం, శేరుశేరు నెయ్యీ అవుతోంది. సప్లయిలన్నీ మనం చేస్తున్నాంకదా, యీ రోజుల్లో ఉద్యోగస్తులకు జీతాలు ముట్టుతాయా ముట్టవా?

కర :—సర్కారువారు ఎప్పటికిమల్లేనే జీతాలిస్తారు. ఆ జీతాలు మాత్రమేకాకండా మన మిచ్చే మామూళ్ళు అన్నీకలిపి పదిహేను రూపాయల గుమాస్తాలుకూడా జమాబందీ అయి యింటికి వెళ్ళేటప్పుడు నాలుగేసి ఐదేసివందలు పట్టుకపోతారు! ఉద్యోగస్తులు భోజనాలు మనలాగే చేస్తారుగాని ఎక్కువ తెప్పించిందంతా తమరిని ఆశ్రయించుకొని ఉన్నవారికి యిస్తారు.

ముని :—ఈ జమాబందీలో సిరస్తాదారుగార్కి మొత్తం ఏమాత్రం దొరుకుతుందండీ?

కర :—మన శిరస్తాదారుగారికా? ఎంతదొరుకుతుందో నాకు తెలియదుగాని, తహశీల్దారు ద్వారా మామూళ్ళుంటవి. ఈ తాలూకాలో మొత్తం నాలుగువేల రూపాయల మామూళ్లు ఉండవచ్చు! అంతదూరమెందుకూ! ఉపనయనం చేసుకుంటారనీ, యిల్లు కట్టించుకుంటారనీ, యజ్ఞాలు చేస్తారనీ, సత్రాలూ, చలివేంద్రాలుపెట్టిస్తారనీ వీరు సిఫారస్ చేసే బ్రాహ్మలకు యివ్వడానికి కేవలం గ్రామాలమీద వసూలుచేసే సొమ్ము ఎంతవుంటుందో చూడు! మొన్న కాశీ సంతర్పణచేస్తానన్న బ్రాహ్మడు ఒకడు మన తాలూకాలోంచి ఎనిమిదివందల రూపాయలు పట్టుకపోయినాడు. శిరస్తాదారుగారు పంపించిన భోగందానికి ఏతాలూకాలోను వెయ్యేనూటపదహార్లకు తక్కువ యివ్వలేదు!

వీర :—సిఫారస్సులు మాత్రమే కాదండీ! ఈ ఉద్యోగస్థులు కూడా యిళ్లు కట్టించు కుంటా మనీ, కొమాళ్లకు కుమార్తెలకూ పెళ్ళిళ్లు చేసుకుంటామనీ చాలా సొమ్ము గుంజుతారు.

కర :—అది సరే! వారియిళ్లో కార్యాలైనప్పుడు ఒక్క డబ్బుతో కుదరదు. ఊళ్లల్లోవున్న మంచివస్తువులన్నీ వాళ్లయిళ్లకే వెళ్తవి. మొన్న శిరస్తాదారుగారు పదివేలరూపాయల యిల్లు కట్టించుకున్నారు గదా! వారికి ఒక్క దమ్మిడీ చేతిది తగిలిందీ? నీకు జ్ఞాపకం లేదూ! మన వూళ్లో వున్న చేవతాడిచెట్లన్నీ కొట్టించి నీవే కాదూ తరువులు వేయించి వెట్టివాళ్ళచేత పంపించావ్. మనవూళ్లో దానయ్యగాదు వేయించిన యిటుకామ అంతా రాత్రికి రాత్రి అక్కడికి వెళ్ళలేదూ? గొప్ప ఉద్యోగస్థుల యింట్లో శుభకార్యాలైతే ప్రజలు పండించిన వస్తువులలో మిగిలినవి అమ్మివేస్తేనే ఎంతో సొమ్ము వస్తుంది.

వీరా :—అరుగో! శిరస్తాదారుగారు వస్తున్నారు. దొరగారిదేరా దగ్గిర బిగ్గరగా మాట్లాడుతున్నారని బంట్రోతుల్ని పెట్టి కొట్టిస్తాడు. పారిపోదాం రండి! (అని లేచి పోతున్నారు.

---

## రెండో రంగము

(తహశీల్దారుగారును, తాలూకా గుమాస్తాయున్నూ ప్రవేశిస్తున్నారు)

తహ :—ఏమండీ గుమాస్తాగారూ! మీరు చెప్పినమాట నిజమేనా?

గుమ :—నిజమేనండి. ఇవ్వాళ ఉదయాన శిరస్తాదారుగారి యింటికివెళ్ళితే మీరు యీ తహశీల్దారీపనికి పనికిరారని పైకి వ్రాస్తామని కలెక్టరు దొరగారు మీమీద మండి పడుతున్నారని తెలిసింది.

తహ :—నిష్కారణంగా నామీద యింత కోపం రావడానికి కారణమేమిటండీ? నేను ఒక్క దమ్మిడీ లంచం పుచ్చుకోను. శిస్తులలో ఎక్కడా ఎరియర్స్ లేవు. చురుకుగా పనిచేస్తాను. అందరికంటే ఎక్కువ పరీక్షలు ప్యాసయ్యానూ!

గుమ :—మీరు ఎక్కువ పరీక్షలు ప్యాసవడం, లంచాలు పుచ్చుకోకపోవడమేనండి దొరగారి ఆగ్రహానికి కారణం. మీరు పరీక్షలు యివ్వకపోతే అందరి తహశీల్దారలాగే లంచాలు పుచ్చుకొని అందులో వారికి భాగం యిస్తుండేవారు. మీరూ బాగుపడేవారు, వారూ సంతోషించేవారు. దొరగారి దగ్గర మంచిపేరు వచ్చేది! నిన్న

బొ ట్లేరువాడికి మామూలు నాలుగు రూపాయలూ యిచ్చినట్లయితే వాడు దొరతో ఏమీ చెప్పేవాడుకాదు.

తహ :—నాకు వచ్చే నూటడెభ్భైఅయిదు రూపాయలలోనూ ప్రతివాడికీ లంచాలు ఎక్క డివ్వనూ? నాజీతం మాయింట్లో భోజనానికే సరిపోతుంది. వాడు యెక్కడా దొరకని సువాసనసబ్బు దొరసానిగారికి కావాలంటాడు. ఈ గొంతెమ్మ కోర్కెలు కోరితే ఎక్కణ్ణుంచి తేగలం! ఎంత మంచి వస్తువులుతెచ్చినా మంచివి కాదం టాడు. పుచ్చుకొన్న వస్తువులకు సొమ్మివ్వడు.

గుమ :—మామూళ్ళివ్వకపోతే అన్నీ యిలాంటి తంటాలే వస్తాయి. బొట్లేరువాడు మన మిచ్చిన సన్నబియ్యం దాచేసి, ముతకబియ్యం వండిపెట్టి తహశిల్దారుగారు యిలాంటి పాడుబియ్యం పంపించారని చెప్పాడట! మీరు పంపించిన సబ్బుబిళ్లలు దాచి, మీరు యీవూళ్ళో సబ్బు దొరకదన్నారని దొరసానిగారితో చెప్పాడట!

తహ :—దొరలూ నిజం తెలుసుకోకండా యిలాంటివాళ్ళ చెప్పుడుమాటలు వింటారండీ?

గుమ : —నిన్న దొరగారు తిండితిని దేరాలో వంటరిగా కూర్చుంటే గుమాస్తాలు కచ్చేరికి ఆలస్యంగా వెళ్ళారు. ఎందుకింత ఆలస్యం అయిందంటే, మేము సొమ్ముపంపినా, తాశీల్దారు బియ్యంవగైరా వేళకు సప్లయిచేయక, అరగంటముందే పట్టి చేబియ్యం పంపించాడనీ, వుండి వుండి ఆ అన్నం తినడానికి వీల్లేక పారేసి దొరగారు కోప్పడతారేమోనని త్వరగా పనుగెత్తుకొచ్చామని అందరూ ఏకకంఠంతో చెప్పారు. అలా చెబుతోంటే ఎంత శాంతుడుకైనా కోపం ఎందుకురాదూ?

తహ :—నా జీతంలోంచి పెట్టుకొని అన్నీ వేళకు సప్లయిచేస్తున్నానుకదా, అబద్ధాలు చెప్ప డానికి యీ గుమాస్తాలకేం పొయ్యేకాలం వచ్చింది?

గుమ :—సప్లయిలెన్నిచేసినా మామూళ్ళివ్వకపోతే, ఏదోసమయంలో దొరతో ఏదైనాపితూరీ చేస్తారు. ఎంత న్యాయస్తుడైనా ఒకప్పుడు యీ చెప్పుడుమాటలు నమ్మకతప్పదు.

తహ :—ఈ సంగతులన్నీ దొరగారితో స్వయంగా చెబుదామని పొద్దునవెళ్ళి సమయం చిక్కక వచ్చాను. బంట్రోతు ఎన్నిసార్లుచెప్పినా సమయంకాదని చెప్తూవచ్చాడు. నిజం మనవిచేసుకోడానికి దొరగారికి ఖాళీలేకపోతే ఎట్లా మొత్తుకోను?

గుమ :—మామూళ్ళు పారవేసినట్టయితే వెళ్ళగానే మీకుదర్శనం అయ్యేది. అదిలేకపోతే దేరాముందు వెయ్యేళ్ళుకూర్చున్నా అంతే! శిరస్తాదారుగారికీ మీమీద కోపమే! పైకి మంచిగా ఉన్నా, వీలుదొరికితే ఎందులోనైనా పట్టుకొని మిమ్మల్ని గట్టిగా నొక్కివెయ్యాలని చూస్తున్నాడు. నిరుడు, ఆయన పంపిన భోగందానికి మీరేమీ ముట్టచెప్పలేదట!

తహ :— ఇంతమంది నిష్కారణంగా హానిచెయ్యాలని చూస్తూంటే నేనొక్కణ్ణి ఏంచేయ గలను? నా ఉద్యోగమైనా పోవడానికి ఒప్పుకుంటానుగాని నా జన్మలో. లంచాలు మాత్రం పుచ్చుకోను. ఏ ఉపాయమూ తోచకుండా వున్నదండీ!

గుమ :—లంచాలు పుచ్చుకోవడంతప్ప రెండో మార్గమేమీలేదు. మీరు లంచాలు పుచ్చు కుంటేనేతప్ప మీ సంవత్సర జీతం ఖర్చుపెట్టినా వీళ్ళని సంతృప్తిపరచలేరు! హుజూరు వాళ్ళకు మీరు సొంతంగానైనా యిచ్చుకోవాలి; లేక తాలూకామీదనైనా పడాలి. ఆరెండూ మీకు చేతగావు. ఇకవాళ్ళని మీరెలా మెప్పించగలుగుతారు? మీలాగే మడిగట్టుకొని కూర్చుంటానని బెట్టుచెయ్యబోతే ఒక తహశీల్దారుకి ఇట్లాగే బర్తరఫ్ అయింది.

తహ :—కారణం లేకుండానే పైవాళ్ళుమాత్రం వూరికే బర్తరఫ్ చేస్తారా?

గుమ : - వెతికేవాళ్ళకి అన్నీ కారణాలే కనపడతాయి. లంచాలు పుచ్చుకోని తహశీల్దారు ఉంటే, కింది ఉద్యోగులు ఉన్నవీ లేనివీ కలిపి దొంగఫిర్యాదులు తెప్పించి, నానా అవస్థలూ పెడతారు. ప్రజలకుకూడా లంచాలు పుచ్చుకొనేవాళ్ళు వుండడమే యిష్టం. సర్కారుకు నష్టంవచ్చినా లంచాలిచ్చి తాము లాభం పొందుతూవుంటారు.

తహ :—పోనీయండి! అలా లంచాలు పుచ్చుకోడానికంటే ముష్టెత్తుకోవడం ఉత్తమం! ఇది ఏమి దురన్యాయమో నాకు తెలియకుండా వుంది. ఇది ఉద్యోగస్తుల లంచాల జమాబందిలాగా వుందికాని, సర్కారు శిస్తు జమాబందిలాగా లేదు!

గుమ :—మీకింకా అనుభవం తక్కువ గనుక నీతులు చెబుతున్నారు. ఈ తహశీల్దారీ కాస్తా పోయింతర్వాత మీ మొహం ఎవ్వరూ చూడరు. బాగా ఆలోచించుకోండి! మీకూ మాకూ బంధుత్వం కలిసివుంది గనక మీక్షేమంకోరి యింతగా మనవి చేశాను. సెలవిస్తే యీ సాయంకాలమే శిరస్తాదారుగారితో మాట్లాడి అన్నీ చక్కబెట్టుకొని వస్తాను.

తహ :—ఆలోచించి తర్వాత చెబుతానులెండి. ఇప్పుడు భోజనం వేళైంది. వెళ్తాను.

— తెర —

★

# గొట్టాలమ్మ సభ

(మాదిగ మల్లిగాడు, గౌండ్ల గాలిగాడు, పూజారి పూర్ణయ్య, కాపు కామయ్యాయు ప్రవేశిస్తున్నారు.)

కామ :—ఒరే! మల్లిగా, వూళ్లో అమ్మోరిజాడ్యాలు యిల్లా ఉన్నప్పుడు మనం అమ్మోరిని నడిబీధిలో నిలుపక్కర్లేదంట్రా ?

మల్లి :—బాబూ! తప్పకుండా నిలపాలండి. మాకు దప్పులపని లేకపోవడంచేత కల్లునీళ్ళకు లేక చస్తూండాము మా మాదిగోళ్ళందర్నీ పోగుచేస్తా, తప్పకండా వుత్సవం చేయించండి. ఈ మూలంగానైనా మాకు నాలుగుడబ్బులు దొరుకుతాయి.

గాలి :—ఔనండీ! తప్పకుండా చేయాల్సిందే! మాదిగోళ్ళకు మాత్రమేకాదు. మాకూ నాలుగుడబ్బులు గిట్టుతాయి. ఇప్పుడు మనవూళ్ళో యెంతమంది కల్లుతాగినవాళ్ళున్నా యీ జాతర దినాల్లోలాగా మరెప్పుడూ ఖర్చుకాదు. కావలిస్తే మావాళ్ళందర్నీ పోగు చేసి, దీనికి కావలసినంత సరంజామా చేయిస్తాను. ఇచ్చుకోమంటే తలా రెండణాలు చందాకూడా యిచ్చుకుంటాం.

కామ :—ఇక అంతా కుదిరింది. పూర్ణయ్యా నువ్వేమంటావ్ ?

పూర్ణ :—నేననేది ఏముంది! నీచిత్తం. నాలుగు రాళ్ళు దొరికేటప్పుడు నాకు సంతోషమే. ఈ యేడు వేటపోతులు, బియ్యం చాలా దొరుకుతాయ్.

కామ :—అందుకు సందేహమేమిటి ? వెయ్యి వేటపోతులూ, పదివేల కోడిపెట్టలూ తెగక పోతే నన్ను మారుపేరున పిలవండి. పాపిష్టిదేవుడు మాంసం నిలవవుండకండా చేసేడుగాని, లేకపోతేనా యేటికియేడాది యీ మాంసం మనందరికీ పుష్కలంగా సరిపోయేది.

పూర్ణ :—కామయ్యగారూ! ఇందులో యింకొకటి వుందండీ. బ్రాహ్మలూ, కోమట్లూ నరికించే వేటపోతులు మాత్రమే మనకు దక్కుతాయిగాని; శూద్రులవి వొక్క తల మాత్రము యిచ్చి తక్కినభాగం వాళ్ళే పట్టుకవెళతారు. అదిలేకండా చేస్తారా ?

కామ :—ఇప్పుడు మనం ఆ ప్రయత్నం చేయకూడదు. ముందుముందు ఆ సంగతి ఆలోచిద్దాం. బ్రాహ్మలు యిచ్చే మేకపోతులే మనకు నెత్తికినేలకి చాల్తాయి. అంతగా చాలకపోతే తర్వాత మన గణాచారిగాడిచేత మేకపోతుల్ని యింటికి తీసుకపోతే

రోగాలు ఎక్కువచేసి వూళ్లోవాళ్ళందర్నీ చంపుకొనిపోతానని అనిపిద్దాం. అమ్మోరు యిల్లాగ అన్నదంటే అందరూ మేకపోతుల్ని మనకు యిచ్చేపోతారు.

మల్లి :—నేనిప్పుడే చెబుతున్నానండోయ్! తెగిన మేకపోతుల తలకాయలన్నీ మా మాది గోళ్ళవే సుమండీ! తర్వాత లేదనేరు.

కామ :—సరేలే! మామూలు ఎలాగో అలాగే చేయవచ్చు. పూర్ణయ్యా! ఇప్పుడే చెబుతున్నాను. దొరికే బియ్యంలోనూ వచ్చే దక్షిణల్లోనూ సగంమాదీ, సగంమీదీ సుమా! తర్వాత తగూలు పెడితే పనికిరాదు.

పూర్ణ :— అలాకాదు. కష్టపడేవాళ్ళం మేముగనక, రెండువంతులు మాకిచ్చి ఒకవంతు మీరు పుచ్చుకోండి.

కామ :—అలా వల్లపడదు. మాకు సగంవంతు యిస్తేనే వుత్సవం జరుగుతుంది. లేకపోతే జరగనే జరగదు. నన్ను కనుక్కోకండా మీరు పాకలు వేయిస్తిరా మర్నాటికి తగలడతాయో లేదో మీరే చూస్తారు.

పూర్ణ :— మీ యిష్టం వచ్చినట్లే మీరు పుచ్చుకోండి. బాజావాళ్ళకూ, డప్పులవాళ్ళకూ అయ్యే ఖర్చులుపోగా మిగిలేదానిలో సుమా అండి, మీకు సగం యివ్వడం. అనిక అంతట్లోను సగం తెమ్మంటారు.

కామ :—అలా తెమ్మనడానికి నేనుమాత్రం న్యాయం ఎరగనివాణ్నా? అన్నిఖర్చులూ పోగా మిగిలేదాంట్లోనే చెరిసగం తీసుకుందాం. ఔనుగాని, నీవు గరగల్ని ఎత్తుకొని వీధుల్లో తిరిగేటప్పుడు అమ్మోరు యేంచెప్పిందని చెబుతావ్?

పూర్ణ :—అదీ, మీరే శెలవియ్యాలి.

కామ :—మంచిది. ఆలోచించి చెప్తానుండు ఆఁ! నాస్తికుల మాటవిని వేపకొమ్మలు కట్టకండా, గంధకం, తారు, పొగలువెయ్యడంచేత నాకు కోపంవచ్చి ఇలాగు చంపుతూన్నానని ముఖ్యంగా చెప్పాలి. తరువాత....నాకు జాతరలూ, వుత్సవాలూ చెయ్యడం మానేశారు. ఇప్పటికైనా బుద్ధితెచ్చుకొని నాకు జాతరలు చేయించకపోతే శవాలను బళ్ళతో తోలేటట్లు చేయిస్తానన్నదని చెప్పు. మరచిపోకండా ఈరెండూ ముఖ్యంగా చెప్పాలి. అలాచెప్పకపోతే ఇంగ్లీషు చదువుకున్నవాళ్ళ మాటలునమ్మి దొడ్లు శుభ్రం చేసుకోవడం. గోడలకు వెల్లవేసుకోడం. నీళ్లుకాచి వడగట్టితాగడం, తారూ,గంధకం పొగలువెయ్యడం ముఖ్యంగా చూసుకుంటారుగాని, మనకు బియ్యాలు యివ్వడం, చలిమిడీ, నానుపప్పూ నైవేద్యాలు పెట్టడం, వేటపోతుల్ని ఇవ్వడం మానేస్తారు.

పూర్ణ :—అదిసరేగాని యీ గంధకపు పొగవల్లా, వాటివల్లా ఏమైనా ప్రయోజనంవుందీ?

కామ :—ప్రయోజనం వుంది. లేంది ఆ గొడవ మనకెందుకు? మనకు నాల్గుడబ్బులురాలే పని మనం చూసుకుందాం. మనకు బలులు యిచ్చేవాళ్ళందరికీ రోగాలు రాకుండా వుంటున్నాయా ? వాళ్ళు చావకుండా వుంటున్నారా ? ఏంచేసినా చచ్చేవాళ్ళు చావనే చస్తారు ! బ్రతికేవాళ్ళు ఎట్లాగో బ్రతుకుతారు! గాలిలోను నీళ్ళలోను, యేముందీ? ఈ గోదావరీ, యీ గాలీ, ప్రపంచం పుట్టినప్పటినుంచీ వున్నాయిగాని, బ్రహ్మ దేవుడు వీటిని కొత్తగా పుట్టించేడా యేమిటి?

పూర్ణ :—పోనీయండి ! ఆయుర్దాయంవుంటే ఎల్లాగో బ్రతుకుతారు. ఆసంగతి మనకెం దుకుగాని అమ్మవారు మూకుట్లో ఏంపడవేసిందని అడుగుతారు. ఏంచెప్పమంటారు?

కామ :—ఏం చెప్పమన్నావా ! ఊ ! పసుపూ కుంకుమా పడవేసిందని చెప్పు. 'ఇకనాకు తిన్న సేవచేయిస్తే మీ పసుపూ కుంకుమా చల్లగా వుంచుతా,' నని అమ్మోరి అభి ప్రాయంగా అర్థం నీవు విప్పి చెబుతూవుండు.

పూర్ణ :—అలాగే చెబుతానుకాని పదిమంది గణాచార్లనీ, శివశక్తుల్నీ పోగుచెయ్యాలే !

కామ :—ఇప్పుడు అంతమంది రారు. ఎవళ్ళనైనా డబ్బుయిచ్చి రోజుకూలీకి తీసుకు రావాలి. వాళ్ళయినా మునపటిలాగా అల్లరిచెయ్యడానికి వల్లగాదు. వాళ్ళయింటికాడ గంతులేస్తే పిల్లాడు జడుసుకున్నాడని కిందటిమాటు వొకాయన ఒక శివశక్తిని చావతన్నేడు. అప్పణ్ణించి భయంచేత ఎవళ్ళూరారు. ఇంకోఆయన ఒక గణాచారి తన్నేమో తిట్టేడనే కోపంచేత తిన్నగా బజారుకు పరుగెత్తి పేముబెత్తం కొను క్కొని వీపూదిపూసుకొని వేపమండలు చేత్తో పట్టుకొని తన పగ తీరేటట్టుగా బాదే శాడు. పోగా మామూలుగావచ్చే ఆ ముండలుమాత్రం యిద్దరువస్తారు.

పూర్ణ :—వాళ్ళే చాలునులెండి. వాళ్ళకు కాసిని కల్లునీళ్ళు పోయిస్తే కొంచెం తూలుతూ నడుస్తారు. వళ్ళు తెలిసివుంటే ఎవరైనా కొట్టిపోతారేమో అనే భయంచేత వాళ్ల యినా ఆకాస్త అల్లరీ చెయ్యరు. ఇప్పుడు అన్నీ కాని కాలాలు వచ్చిపడ్డాయి.

కామ :—అవును. ఇప్పటికాలం మంచిదికాదు. సరే ! మనం వెళ్ళదాం రండి. రేపు వూళ్లో నలుగురితోనూ చెప్పి మీటింగు చేయించి అమ్మోరి జాతర నిమిత్తం చందాలు వేయిద్దాము. మన వూళ్ళో ఆఖరికి అయిదువందలైనా చందా వసూలు కాకపోతుందా ?

(అని మాట్లాడుకుంటూ వెళ్ళుతున్నారు.)

తెర పడుతుంది.

★

37

# శకునాలు

[పాపయ్య పంతులుగారు, కామయ్య శాస్త్రిలుగారు ప్రవేశిస్తున్నారు]

కామ :—పాపయ్య పంతులుగారూ! మీకు గొప్పఆపద సంభవించింది. ఈ దొర వట్టి కిరాతకుడు. నూరురూపాయల పని నిష్కారణంగా పోయింది! జాతివాడి స్వభావం ఎరిగినవారు గదా మీరు. రెండురోజులు ముందుగా బయలుదేరక పోయారండీ?

పాప :—ఏం చెయ్యనండీ? ఆడవాళ్ళతో ప్రయాణమా! మంచీచెడ్డా విచారించకుండా దూరాభారం ఎలా బయలుదేరనండీ? మొదట అమావాస్యకు ముందే బయలుదేరుదామనుకున్నా. దోవలో అమావాస్యవస్తే మంచిదికాదని పెద్దలుచెప్పారు.

కామ :—అమావాస్య వెళ్ళిన విదియనాడు ప్రయాణంకట్టినా రెండురోజులు ముందుగానే వచ్చేసేవారు.

పాప :—అమావాస్యవెళ్ళినా, పాడ్యమి బొత్తిగానే మంచిదికాదాయె! విదియనాడు బయలుదేరుదామంటే ఆరోజు శుక్రవారం అయింది. అక్కడికీ మొండిధైర్యం చేసి ప్రయాణం కడదామని ఆలోచిస్తూఉంటే, తుసుక్కుమని ఎవరో లోపల తుమ్మారు. అటువంటి అపశకునం అయింతర్వాత ఆరోజుకి ప్రయాణం మానేశా.

కామ :—పోనీ, తదియనాడు తెల్లవారకట్ట బయలుదేరకపోయారా?

పాప : అన్నీ ఎరిగిన మీరే ఆలా శంవిస్తారేమిటి? పిల్లల్ని తీసుకొని శనివారం ఉదయాన్న దుర్ముహూర్తంలో బయలుదేరడమే! ఆ మధ్యాహ్నం వర్షం దాపరించింది! ఇక, ఆరాత్రి బండికోసం వర్తమానం పంపించపోతూవుంటే గుడ్లగూబ కూసింది. ఆమర్నాడు చవితికదా! ప్రయాణానికి లాయకికాదని మీ కెరిగిందేగా?

కామ :—ఒహో! చివరకి పంచమినాడు బయలుదేరేరు కాబోలు. అలాగైతే యిక్కడికి మూడురోజుల క్రిందటనే చేరుకోవాలసింది.

పాప : ఆరోజూ బయలుదేర లేదండీ! ఆరోజు ప్రొద్దున నక్షత్రం చెడ్డదైంది. దానికి తోడు వర్షంకూడా తయారైంది! మధ్యాహ్నం బయలుదేరుదామంటే భోంచేసి

పచారు చేస్తూవుండగా మాలబల్లి మీదపడింది. జోతిష్యుణ్ని పిలిపించి, స్నానం చేసి దీపంపెట్టుకొని శాంతీ, గింతీ చేసుకునేటప్పటికి దీపాలవేళయింది. రాత్రి భోజనాలుచేసి ప్రయాణం కట్టుదామాఅంటే, పెద్దలందరూ చుక్కెదురు వెళ్ళకూడదన్నారు.

కామ :—మర్నాడు షష్ఠిగనక అసలే బయలుదేరలేదనుకుంటాను!

పాప :—ఒక షష్ఠిమాత్రమే ఐతే పోనీ అనుకోవచ్చు. ఆవేళ పిడుగులాగా మంగళవారంకూడా వచ్చింది. ఈరెంటికీ తోడు ఆదినం వట్టి పాడునక్షత్రం.

కామ :—ఇక సప్తమినాడు బయలుదేరారూ? అక్కడికి బండి బాగా నడిచి వుంటుంది. భోజనాలవేళకి నిన్న యిక్కడికి చేరుకున్నారూ?

పాప :—సప్తమీ బుధవారం ప్రయాణానికి బహు అనుకూలమైనదినం అయినప్పటికీ ఆ రోజు ఉదయం సందర్భపడలేదు. ఆరోజు ముహూర్తం స్థిరపరిచాం. మా చిన్న కుర్రాడి పుట్టినరోజు అయింది. పండగచేసుకొని భోజనాలుచేసి బయలుదేరుతేకాని వల్లకాదని ఆడవాళ్ళు పట్టుపట్టేరు. ఆ ఉదయాన్నే బయలుదేరితే దొంగలమర్రి మధ్యాహ్నమే దాటిపోదుము. భోజనాలుకాగానే బయలుదేరుదామని బళ్ళుకట్టించి తీరా ఎక్కబోయేటప్పటికి వెధవముండ యెదురుగుండా వచ్చింది. మళ్ళీ లోపలికి పోయి అరగంటసేపు ఆగేము. అప్పుడు బయలుదేరినా దీపాలుపెట్టకముందే దొంగలమర్రి దాటేవాళ్ళం. మళ్ళీ వీధిగుమ్మంలోకి వచ్చేటప్పటికి ఒంటిబ్రాహ్మణుడు ప్రత్యక్షమయాడు! మళ్ళీ కొంతసేపు ఆలస్యంజరిగింది. ఇది ఇల్లాచేస్తే లాభంలేదని వీధిలో యెవడూ నడవకుండా జాగ్రత్తపెట్టి, పొరుగింట్లోనుంచి ఒక ముత్తైదు ఎదురుగుండా వచ్చేటట్టు బందోబస్తుచేసి చటుక్కున బండెక్కాం. ఎంత మంచి శకునంచూచి బయలుదేరినా లాభం లేకపోయింది. రాత్రి 10 గంటలకు దొంగలమర్రివద్దకు జడుస్తూ చేరుకున్నాం. మేము జడిసినట్టుగానే యెట్లాగ్రహించారోగాని. దొంగలు సమయానికి వచ్చి నగలన్నీ యెత్తుకుపోయినారు. మంచి శకునబలంవల్ల ప్రాణాలకు అపాయంలేకుండా బ్రతికి బయటపడ్డాం.

కామ :—దాని ముండామోసినసొమ్ము! అందుకు విచారమెందుకండీ? ప్రాణాలు దక్కితే మళ్ళీ సొమ్ము గణించుకోలేం? శలవుదినాలు అతిక్రమించి వచ్చారని ఆ దొరముండాకొడుకు అక్రమంగా పనితీసివేయడం చేత ఎల్లకాలమూ జరిగే జీవనానికి భంగం కలిగిందని నాకు చాలా విచారంగావుంది. ఐనా, తమకేమి, మహారాజులు! ఇదివరకు సంపాదించిన దాంతోనే జీవనం చేస్తారు.

పాప :— నాకు ఏలినాటి శనివుందని జోశ్యులు చెబుతూవచ్చారు. ఇదీ దానిఫలం. మొన్న మళ్ళీ. నేను జాతకం చూపిస్తే నీకు యేడాదిలో ధననష్టం వస్తుందని చెప్పాడు. అదంతా దాఖలా యిస్తూఉంది! ఉండండి. అడుగో! మా అబ్బాయి స్కూలునుంచి వస్తున్నాడు. వాడు శకునాలూ, గికునాలూ లక్ష్యంచేయక బయలు దేరాల్సిందని నాతో చెడపోరాడు.

( సుబ్బారావు ప్రవేశం. )

కామ :—చిన్నవాడికి యీసంగతులన్నీ ఏంతెలుసండీ? అందులోను యిస్కూళ్ళల్లో చదువుకునే వాళ్ళకు దేవుడూ, దయ్యం; వారం, వర్జం, బొత్తిగా ఏమీ అఖ్కర్లేదండీ! సంసారం మీదబడితే అప్పుడు అన్నీ తెలుస్తాయి.

సుబ్బా :—ఇక మామీద ఎన్ని సంసారాలు పడ్డా యిప్పుడు తెలిసిందానికంటే యీ విషయంలో యెక్కువగా తెలియనఖ్కరలేదు.

పాప :—కుర్రాడు. వాడితో ఏమిటిగాని. ముందు చేయాల్సిన పనేమిటో బాగా ఆలోచించి సెలవియ్యండి.

కామ :—ఏముందీ! శని చాలడుగనుక నవగ్రహ జపంచేయించి బ్రాహ్మలచే గ్రహశాంతి చేయించడం వకటి. అందునిమిత్తమై దశవిధ దానాలూ హోమాలూ, చేయించడం రెండవపని. అటుతర్వాత మీశక్తికొద్దీ రెండువందలమందికో, మూడువందలమందికో సద్బ్రాహ్మలకి సంతర్పణచేసి ఏదో మీకు తోచినంత సంభావన యివ్వొచ్చు!

సుబ్బా :—వద్దు నాన్నగారూ! మీరిక యిలాంటి పాడు ఖర్చులేమీ పెట్టుకోకండి. బ్రాహ్మలు ఎలాగైనా మీచేత పది డబ్బులు ఖర్చుపెట్టించి దిట్టంగా భోజనాలుచేసి దక్షిణలు పుచ్చుకొని ఎలాగైనా తాము బాగుపడేటందుకు చూస్తారు. నామాటలువిని మీరు జపాలూ, తపాలూ కట్టిపేయండి. దొర అనుగ్రహం సంపాదించడానికి గట్టి ప్రయత్నం చెయ్యండి. మీరు లంచాలు తీసుకుంటున్నారని దొర వివరంచేత యిల్లాచేసి వుంటాడు. ఇక్కడ దొరకు అనుగ్రహం రాకపోతే యీ బ్రాహ్మలకు పెట్టే సొమ్ము పెట్టి చెన్నాపట్నం వెళ్లి అప్పీలుచేసుకుంటే తప్పకండా కార్యం గట్టెక్కుతుంది. ఈవారాలూ, వర్జాలూ చాదస్తమంతా మాని, నేను మొత్తుకున్న ప్రకారం విదియనాడే బయలుదేరినట్టయితే యీ చిక్కులన్నీ దాపురించేవికావు. నీ ఉద్యోగం పూడేదీకాదు.

పాప :—అలాఅనటం తప్పురా అబ్బాయి. జోశ్యం బొత్తిగా కొట్టెయ్యకూడదు. మన సొమ్ము కొంత బ్రాహ్మలవాళ్లో పడితేనేగాని మనం యేం అపీలుచేసినా లాభముం

దదు. నవగ్రహాల జపంతోబాటు యివ్వాళనుంచి సూర్యనమస్కారాలుకూడా చేయిద్దామా ?

కామ :—పాపయ్య పంతులవారు కేవలమూ బ్రహ్మణ్యులు. వారికి తెలియనిదేముందీ? బ్రాహ్మల కెంతయిస్తే భగవంతుడంత సంతోషిస్తాడు. భగవంతుడు సంతోషిస్తే సమస్త కార్యాలకూ విజయం కలుగుతుంది। అబ్బాయ్। నీవింకా బొడ్డూడని పిల్లవాడివి. నీకింకా మంచీచెడ్డా తెలియదు, వూరుకో।

సుబ్బా :— మీకన్నీ మహాతెలుసు। ఇదివరకు బ్రాహ్మలకు పెడుతూవచ్చిన ఫలం నేటికి యిల్లా కనపడిందికదా। (తండ్రితో) నేను చెబితే వింటారుగనకనా। చెయ్యండి. మీయిష్టం వచ్చినట్టు చెయ్యండి। ఎప్పటికైనా నిజం తెలుసుకోలేకపోతారా ? (అంటూ వెళ్ళిపోతాడు)

— తెర —

★

41

# శిశుపోషణము

(రావూరి రామయ్య పంతులుగారు, భార్య కనకమ్మ ప్రవేశిస్తున్నారు)

రామయ్య :—ఓసి పాడురండా! నీకేంచేటుకాలం వచ్చిందే? పిల్లవాణ్ని అల్లా కొట్టి యేడ్పిస్తున్నావ్?

కనకమ్మ :—మీకస్తమానం నన్నాడిపోసుకోవడంతో తేసరిపోతోంది. అల్లరిచేస్తే పిల్లవాణ్ణి కాస్త ఆ అని అదమాయించడానికి వల్లకాదు. ఏమైనా అంటే పెద్దపులిలాగ మీద పడతారు. నేనన్నిటికీ దవడలు దగ్గిరగా నొక్కుకొని సగం చచ్చి పడివుంటాను. నేను లోకంలోవాళ్ళ పెళ్ళాలవంటిదాన్ని ఐతే మీరు నన్ను ఒక్క నిమిషం బతకనియ్యకపోదురు!

రామ :—పిల్లవాడు నిజంగా అల్లరి చేసినప్పుడు యేమైనా శిక్షచేస్తే నేనుమాత్రం వెందుకంటాను? ఇప్పుడు వాడేంనేరం చేశాడు చెప్పు? ఛెళ్ళుఛెళ్ళున ఐదువేళ్ళూ అంటుకునేటట్లు వాడి వీపుమీద అలా చరచావు. వాడుచేసిన తప్పిదం 'అమ్మ తలమీద నీళ్ళుపోసిం'దని చెప్పడమేనా? మరేమైనా ఉందా?

కన :—అదిచాలదూ? ఇంకా ఏం తప్పిదంకావాలి? ఆడవాళ్ళకు మొగవాళ్ళతో చెప్పకూడని రహస్యాలు ఎన్నయినా వుంటాయ్. వేలెడు వెధవలేడు! ఇప్పణ్నుంచీ గడుగ్గాయతనం నేర్చుకొని రహస్యాలన్నీ యిల్లా చెబుతూఉంటే, ముందు వీడేం అక్కరకువస్తాడు? మీకు నామీద కోపంరావడానికి వూరికే అమ్మ తలమీదవన్నీళ్ళు పోసిందని చెప్పటమేనా? ఎందుకుపోశానో ఏమైనా చెప్పాడా!

రామ :—ఎందుకుపోశావో ఇప్పుడు నువ్వు చెబుదూ? విని సంతోషిస్తాను!

కన :—నా మాటంటే మీకు వేళాకోళాలూ, వెక్కిరింతలూనూ! వాళ్ళుచేసే అల్లరిపనులు కనబడవు. నేనేమైనా అంటే నానోరు అందరికీ వినబడుతుంది. వాడు పనిగట్టుకొనివెళ్ళి చొడ్లో దాసీదాని కొడుకును ముట్టుకున్నాడు. తలనిండా నీళ్ళుపోయకుండా బ్రాహ్మణజన్మ ఎత్తినతర్వాత వాణ్ని శూద్రకూడు ఎల్లా తిననివ్వనూ? అదికాకుండా వాడు అమట్టుగావచ్చి పరుపు మంచం ముట్టుకొని బట్టలన్నీ మైల పడేస్తే అవన్నీతడిపి ఆరెయ్యలేక చావాలి. పాతాళలోకంలో వున్నాయి; నూతిలో

నుంచి చాదెడునీళ్ళు పైకి పెకిలివచ్చేవరకు పేగులు తెగిపోతై. ఆడవాళ్ళకుండే కష్టాలు మగవాళ్ళకేం తెలుస్తాయి?

రామ :—నీకు ఎన్నివిధాల బోధించినా ఛాదస్తం ఆవగింజంతైనా వదల్లేదు. చిన్నపిల్లవాడు శూద్రుణ్ని ముట్టుకుంటే ఇంట్లో బట్టలన్నీ తడిపి ఆరెయ్యాలా? నీవు రోజుకు మూడుసార్లు తడుపుతూవుంటావు గనుకనే చీకిపోయి బట్టలన్నీ మూణ్ణాళ్ళకే మళ్లీ చినిగిపోతూవుంటాయి. ఈ యింటికి జేష్ఠాదేవిలా పోగైనావు.

కన :—మీరు వెయ్యనండి, లక్ష అనండి! మీకుమల్లే మైలకూడు నానోటికిపోదు. మీరు చిన్నప్పటినుంచీ మాలబళ్ళల్లో చదువుకుని కిరస్తానీవాళ్ళతో సావాసం చేస్తున్నారు గనక, మైలా మడీ ఆచారం వ్యవహారం అక్కర్లేకండా అడ్డమైనవాళ్ళను ముట్టుకున్న బట్టలతో వచ్చి మైలకూడుతినడం మీకు అలవాటయింది. అటువంటి యెంగిలిమెతుకులు నాకు లోపలికిపోవు. అంచేతనే నేను మీ విస్తట్లో కూర్చోక వేరే విస్తరివేసుకొని తిని యెంగిలి విస్తరి తీసేసి తలనిండా స్నానంచేస్తా.

రామ :—నీవు ఎన్ని స్నానాలన్నాచెయ్యి! మూడేళ్ళకుర్రవాణ్ని రోజూ చన్నీళ్ళల్లో మూడేసి స్నానాలు చేయిస్తూఉంటే వాడికి రొంపపట్టి ముసముసలాడుతూవున్నాడు. చలివేస్తూంది. వాడివంటికి చొక్కాతొడగమంటే తొడగక ఎప్పుడూ మోడులాగా వుంచుతావు.

కన :—వాడికి పదేళ్ళు పైనపడ్డాయి గనకనా, చొక్కా వొంటిమీద వుంచడం? చంటిపిల్లవాడూ. నన్ను గడియగడియకూ ముట్టుకొనేవాడికి చొక్కాఎల్లా తొడగనూ? నన్ను వూరికే రవ్వపెట్టడమేగాని మీకు మంచీ చెడ్డా తెలియదు. వాడు నిమిష నిమిషానికీ నన్ను వచ్చి తాకుతూవుంటే మడిగట్టుకుని వంటచేసేదాన్ని నేను ఎన్ని స్నానాలు చెయ్యను? నేను స్నానమంటే యుడియనుగాని నూతులో నీళ్లు తోడట మంటే భయపడతాను. తిన్నగా తిరుగుతూ ఉన్నంతమట్టుకేగాని నాకు రోగంవస్తే నన్ను చూచేవాళ్ళెవరూ? నేను యెంతచదువుకోనిదాన్ని అయినా తెలియక అడుగుతానుగాని, ఎక్కడైనా స్నానాలు చేస్తేనూ, తడిబట్టలు కట్టుకుంటేనూ రోగాలొస్తాయండీ? అవి రావల్సిన యోగముండి ఎల్లాగో వస్తాయిగాని!

రామ :—చాల్లే, యీపాటికి వూరుకో! నీకు పిల్లల్ని పెంచడం యెంతమాత్రం తెలియదు కదా! ఆదమరచి నిద్రాపోతాడని పిల్లవాడికి నల్లులకుపోసే వేడినీళ్ళుపోస్తావు. వద్దంటే వినవు! అంచేత వాడికి వళ్లంతా గజ్జీ, చిడుమూ పట్టుకొంది. అదిగాకుండా ఎక్కడివో మురికివి తాతబట్టలు తెచ్చి పక్కవేసి నులకమంచంమీద పిల్లవాణ్ని పడుకోబెడతావు. ఆ మంచానికితోడు దానికింద కుంపటికూడపెట్టి పొగ

పెట్టడంచేత కిందకివేళ్లాడుతూవున్న నులకచేరులు అంటుకొని పిల్లవాడి కాలుకాలి పుండు యిప్పటికీ తిన్నగా మానలేదు.

కన :—వాడి కాలుకాలడంగూడా నాతప్పేనా ? దైవంచేసిందానికి నేనేంచేసేది? పిల్లవాడైన తర్వాత కాలూకాలక, చెయ్యీకాలక యెలావుంటుందీ ? పిల్లవాడికి వేడి నీళ్ళు పొయ్యడంచేత గజ్జి పడుతుందంటారు. ఈ విరుద్ధం యెక్కడైనావుందా ? ఇంకా అందరికంటే నేను చాలానయం ! మొన్న సుబ్బమ్మగారింట్లో యేడాది కుర్రవాడికి నీళ్ళుపొయ్యమంటే నావంటిదాన్ని చెంబుపట్టుకోలేకపోయినా, ఆడపనికీ, మొగ పనికీ మీరన్నింటికి మధ్య అడ్డంవచ్చి పిల్లవాడ్ని చెడగొడ్తున్నారు. పిల్లవాళ్ళకు అన్నం, నీళ్ళే బలం ! ఎన్నిమాట్లు అన్నంపెడితే అంతమంచిది. 'ఆడదాని చేతి అర్థం, మగవాడిచేత బిడ్డా నిలవ'దని చెప్పిన శాస్త్రకారుడు వెర్రివాడా ? ఇక పక్కలో ఉచ్చపోసేవాళ్ళకు మురికిబట్టలూ, పీలికలూ గాకపోతే వుతికిన తెల్ల మడ తలు పక్కేసుకుంటారా !

రామ :—అన్నమంటే జ్ఞాపకమొచ్చింది. వాడికి రోజూ కూరి కూరి యేడుస్తూవుండగా నోటికి మిరపకాయరాని యెక్కువ అన్నంపెడ్తావు. అంచేత వాటికి పూదరపొట్ట పెరిగింది.

కన : —నేను అన్నం యెక్కువ పెట్టడంచేత పూదరపొట్టకాలేదు ! మీరు జాతివైద్యం నమ్మి ప్రతిరోజూ ఉగ్గు పెట్టనియ్యకపోవడంచేతను, చిన్నప్పటినుంచీ అన్నం పెట్ట నియ్యక పాలుపోయించడంచేతనూ యీ పూదరపొట్ట వచ్చింది. మీరు జోక్యం కలుగజేసుకోక పిల్లవాణ్ని నేను పెంచినట్లల్లా పెంచనిస్తే యీ గజ్జి, పూదరపొట్టా యేమైనా వుండునా ?

రామ :—నువ్వు పిల్లల్ని పెంచడం మహాబాగావుంది. మన నౌకరివాడి చేతికిచ్చి సాయం కాలం గాలిలో తిప్పడానికి పంపమంటే పంపవు. నాన్నతో వున్నది లేదని చెప్ప మనీ, లేనిది వున్నదని చెప్పమనీ అబద్ధాలు నేర్పుతున్నావు. బూచివాడు వస్తాడనీ ఎత్తుకుపోతాడనీ బెదరించడంచేత భయపడి వాడు నిద్రలోకూడా ఉలికులికిపడుతూ వున్నాడు. ఉగ్గుతోనే పిరికితనం రంగరించి ఇలాపోస్తే పెద్దయింతర్వాత ధైర్య సాహసాలు ఎట్లా అలవడుతాయి ? వాడు తిడితే వూరికే సంతోషిస్తావూ ! ఇక దీపాన్ని జేజే అని దణ్ణంపెట్టిస్తూ ఉండటంచేత మొన్న వాడు నిష్కారణంగా చేతులు తెగ కాల్చుకున్నాడు. నేరం చేసినప్పుడూ, చేయనప్పుడూ కూడా వాణ్ని వూరికే కొట్టి తిడతావు. చూడు ! నారాయణరావు పంతులుగారి భార్య యెలా పిల్లను నిక్షేపంలా పెంచుతోందో !

కన :—ఆవిడపేరు నాదగ్గిర చెప్పకండి! నాకు తలకాయనొప్పి వేస్తుంది. పండువంటి కుఱ్ఱాణ్ని గాలిలో తిప్పకమ్మా దిష్టి తగుల్తుంది. పిట్టలు పొరుతాయి. అనిచెబితే నామాట లక్ష్యం చేసిందికాదు. తర్వాత అనుభవించేటప్పుడు తెలుస్తుంది. పిల్ల వాడు అప్పటినుంచి ఒక్కమోస్తరుగా పట్టినపట్టు విడవకండా ఏడుస్తూవున్నాడు. మీరు ఒక్కపర్యాయం ఎత్తుకొని వెళ్ళి సముదాయించండి. నేను లోపల పనిచేసుకోవడానికి వెళ్తాను. (అని వెళ్ళుచున్నది)

— తెర —

స ం పూ ర్ణ ము

| మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B164 |
| పుస్తకం పేరు | ప్రేమలేఖలు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 51 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | Ci, BCi, BCi |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |